శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# ఆరోగ్యకామేశ్వరి



శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే
రచింపఁబడినది.

రెండవకూర్పు 1,000 ప్రతులు.



బందరు మినర్వాప్రెస్ నందు ముద్రింపఁబడియె.

1935

# ఉపోద్ఘాతము.

"ఆరోగ్యకామేశ్వరి"

అను నామముచేతనే యియ్యది యారోగ్యార్థ మేర్పడిన కామేశ్వరీస్తుతియని స్ఫుటమగుచున్నదిగదా! ఇఁక నిది యెవరియారోగ్యమునకై యెవరు రచించిరను సంశయమును గబ్బమే వివరించెడిని. ఇందుఁగల పద్యములు రెండువందల కొకటిరెండుకన్న మించవు. ఇందొకచో గ్రంథకర్తవయస్సు నేఁబది వత్సరము లనియు వేఱొకట నలుబదికి దాదాపనియుఁ గన్పట్టుటంజేసి స్థూలదృష్టిగాఁ జదివికొనువారలకుఁ బరస్పరవిరోధము స్ఫురించెడిని. గ్రంథకర్త దీని నేఁబదివత్సరముల ప్రాయమున మొదలిడి యలుబదికిలోపునఁ బూర్తిచేసినని గ్రహింపఁదగు. అగుచో నీ స్వల్పగ్రంథమున కిన్నియేండ్లు పట్టెనా? యనుశంక కవకాశము కలిగెడిని. తత్త్వ మిది, రోగప్రకోప సమయములయం దప్పుడప్పుడు వివశముగా దొరలిన కవిత్వమేగాని యియ్యది యిట్లు రచింపవలె నను నుద్దేశముతో దీక్షపట్టి రచించినది కాదని సమాధానము చెప్పికోఁదగు. సుమా రెనిమిది వత్సరముల కాలములోని యీపద్యములను నంశము జ్యోతిశ్శాస్త్రప్రవేశము కలవారలకు నిందలి యంశములవలననే మిక్కిలి సుగమము. జననకాలమునకుఁ గొంత చంద్రమహాదశ భుక్తమైనది. శేషము సుమా రైదేఁడులు, పిదపఁ గుజమహాదశ యేడువత్సరములు. పిమ్మట రాహు మహాదశలో రాహ్వంతరము రెండువత్సరముల పైచిల్లర. వ్యాధి ప్రారంభము చంద్రునిలోనే యైనను దాని ప్రకోపావస్థ కుజదశాప్రారంభము మొదలుకొని; కనుకఁ గుజదశ సర్వమును రాహువులో స్వల్పకాలమును ఈపద్యరచన కాస్పదమని విజ్ఞు లెఱుఁగఁగలరు. చంద్రదశలో సర్వసామాన్యముగా నున్నప్పుడు కేవలము మందులమీదనే యాధారపడి పిమ్మట నీయుపాయ ముపక్రమింపఁబడినది.

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ"

అని భగవద్గీత. మొత్తముమీఁద విచారింపఁగా నీవ్యాధి జననమాదిగా సుమా రైదు వత్సరములవఱ కొకరీతిగానుండి పిమ్మటఁ బది వత్సరములవఱకుఁ బ్రకోపావస్థలో నుండి వదవడి సుమారు రెండేం డ్లొకమాదిరిగానుండి యటు పైని కొంతేండ్లు మిగుల నొగిలియుండి పదియేనవయేఁడు ప్రవేశించునప్పటికి

నామమాత్రావశిష్టమైనదని చదువరులు గ్రహింపఁగలరు. ఇట్టి బండవ్యాధులకు భగవదారాధనమే యౌషధసేవకన్న ముఖ్యమని నేను నిశ్చయించికొన్నవాఁడను. మన పూర్వులుగూడ—

“ తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమసురార్చనైః ”

అని లిఖించియున్నారు. ఔషధసేవయు జరిగినది, వైద్యుల సమ్మానములును జరిగినవి. ఎన్నియేని జరుగుఁగాక, అవియన్నియు నొకతల; ఇది యొక తల; ఇదియే యెక్కుడు పనిచేసినదేమో యనికూడ నే ననుకొనుచుంటిని. కొమరుని విషయముననే కాక స్వవిషయమునఁగూడ మున్ను నే నిట్లే ప్రయత్నించితిని. అయ్యది మా కామేశ్వరీ శతకమున నచ్చటచ్చట గోచరించెడిని. ఇందుఁగూడఁ బై సంగతి నొండొకపద్యము తెల్పెడిని. ఎవరో మహాదృష్టవంతులు తప్ప లోకములోని సంతానవంతులెల్ల నిట్లే శ్రమపడుచుందురుగాని, కవులు పడిన పరిశ్రమ కావ్యరూపమును దాల్చుటచే నెల్లరకుఁ దెలిసెడిని; యితరుల దట్లుకాదు.

చ. కొడుకులు గల్గుదాఁక నొకకొన్ని దినమ్ములు చింత, నందనుల్
వొడమిన నాయువున్ బలము బుద్ధియు విద్యయుఁ జాలఁగల్గఁగా
నుడుగనిచింత, కల్గి తను నోలి భజింపనిచింత; తండ్రి కె
ప్పుడుఁ గడుఁ జింతసేయుదురు పుత్త్రులు శత్రులుగాక మిత్రులే.

అని యొకకవి చెప్పియున్నాఁడు

నేను బందరులోనున్న కాలమున విశేషించి కవితాపరిశ్రమసేయుటచే ననారోగ్యమేర్పడి స్వగ్రామము ప్రవేశించినపిమ్మట నీ వ్యాసంగము నుండి పూర్తిగా విరమించితిని. అట్టిస్థితిలో నీరచన యనివార్యముగా ఘటించినది.........................................................

ప్రస్తుతగ్రంథము తుట్టతుద నొకపద్యమీ విషయమున కంతగా సందర్భించునది కాకున్నను, శ్రీ శ్రీ రావు రామయాంబా బహద్దరు జమీందారుగారినిగూర్చి రచింపఁబడినది. ఇటీవల ననఁగా, బందరునుండి స్వగ్రామము ప్రవేశించిన కాలఁదివత్సరములనుండి యిందుక నన్ను నాయింటనె యుంచి నెలకు నిరువదియైదు రూపికల వంతున నుపకారవేతన మను పేరున నేవిధమైన ప్రత్యుపకారము నభిలషింపకయే యొసఁగుచున్న కృతయుగదాత్రీవతంసము నెడల నీమాత్రము కృతజ్ఞత చూపుటకు సంతసింపనివారుండరని నానమ్మకము. ఇట్లుచూపుట గ్రంథకర్తల యాచారమే.

“ శృంగబేరపురాధీశా ద్రామతో లబ్ధజీవికః ”

అని నాగేశోపాధ్యాయులు కృతజ్ఞతం దెలిపెను.

కడియము, } చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,
20—10— శతావధాని.

ఓం

శ్రీమత్పరదేవతాయై నమః

# ఆరోగ్యకామేశ్వరి

శా. అంబా! నాకుఁ గుమారుఁడంట, భవదాఖ్యం దాల్చువాఁడంట, వా
నిం బీడించెడినంట దగ్గొకఁ, డిఁకేనిన్ నీకటాక్షంబు మ
మ్ముం బోషింపక తీరదమ్మ! యివిగో మ్రొక్కుల్, భవత్ప్రేమ మా
లంబం బిత్తఱిఁ గావలెన్ వలవ దాలస్యంబు కామేశ్వరీ.

శా. ఎన్నో మందుల నెందఱో భిషజు లెన్నో భంగులన్ జెప్ప నే
నన్నింటిన్ దగ వాడిచూచితిని, గానైతిన్ గృతార్థుండ, నా
కన్నమ్మన్నను దప్పియన్న రుచిలే దాత్మోద్భవుం డార్తుఁడై
యున్నన్, వీని నరోగుఁ జేయుటకునై యోజింపు కామేశ్వరీ.

శా. ఏదో చిక్కు దయింప నిన్నడుగుచే యే నేర్తు నప్పట్టునన్
నా దైన్యమ్మును బాపి నీవు కరుణన్ మన్నించి రక్షింతు, నీ
పాదం బే శరణంబు పుత్రుని సుఖింపంజేసి రక్షించి యా
మోదం బీఁగదవమ్మ! నాకు సతతంబుం దల్లి! కామేశ్వరీ.

మ. చిరకాలమ్మున కిచ్చి తాత్మజుని నీచిత్త మ్మెటో వచ్చి, నీ
చరణారాధన సల్పి పేరిడితి; నిచ్చల్ వానిఁ గామేశ్వరున్
బరిపీడించును దగ్గొకం? డయినచో భక్తార్తిసంహర్త్రి! నీ
బిరుదం బేగతి సార్థకంబగుఁ గృపాబ్ధీ, తల్లి! కామేశ్వరీ.

శా. నావంశమ్మునఁ దల్లివంగడమునన్ నానాఁడు పూర్వమ్మునం
దేవంకన్ వినరాదు శ్వాసరుజ; వీఁ డిద్దానఁ జిక్కెన్ గడుం
జేవల్ గూర్చి నిరామయున్ సలిపి రక్షింపంగ నీభార, మిం
కే వైద్యమ్ములతోఁ బనే ముబుసుపోకే కాక కామేశ్వరీ.

మ. భయముల్ దైన్యము నా యెఱుంగనివి నాబాల్యమ్మునందుండి, ని
శ్చయ మీసంగతి నీ వెఱుంగుదువు; మార్జారంపుమర్ధ్యాన మె
చ్చయి యిబ్బాలునికంతమందు వినరా నల్లంత నే నాకు నీ
రయిపోవున్ నిలువెల్లఁ, గుఱ్ఱనికి సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ.

మ. తనుసౌఖ్యం బది నాకుఁ దక్కువయినన్ దర్పమ్ము గోల్పోవకే
జననీ! కాలము పుచ్చుచుంటి, సుతు మార్జారంపుమర్ధ్యాన మీ
నను నిర్దర్పునిఁ జేయఁబూనె, మిగులం బ్రార్థింతు నీపిల్లికూఁ
తను దూరంబొనరించి పుత్రునకు మోదం బిమ్ము కామేశ్వరీ.

మ. "జయ మెందెందును దా వహించుటయు నిచ్చల్ పుత్రుచేతన్ బరా
జయముం బొందుట హర్ష" మన్న నుడి కీసారస్యముం గూర్చుటా
శయవేదుల్ విని సమ్మతింపరు; కలాసంపత్తి నాకుం బరా
జయముం గూర్పుము పుత్రుచే, రుజను నిష్కాసించి కామేశ్వరీ.

మ. నరకం బిచ్చెదొ! మోక్షమిచ్చెదొ! తుదిన్ నాకీవు నాతల్లి! యీ
గుఱకన్ బిడ్డనిఁ జేరనీక యిఁక నాకున్ మోదముం గూర్చినన్
నరకమ్మున్ దరియించినట్లె మది నానందింతు, బిడ్డండు శ్వా
సరుజన్ నెట్టిన నాకు నయ్యదియ మోక్షం బంబ! కామేశ్వరీ.

శా. అంబా! వైద్యుల కీరుజావిలసనం బద్దంగ గడ్డంట, వై
ద్యంబుంబోలె భవత్కటాక్ష మసమర్థం బెందుఁ గాదంచు నా
కుం బాల్యమ్మననుండి మేటిగుటి. నాకుఱ్ఱండు నీపేర్మిక
ల్మిం బీడన్ విడి సౌఖ్యముం గనుతఁ దల్లీ! యింకఁ గామేశ్వరీ. 10

శా. ఎంతో కార్యము కల్గికాక వృథగా నేఁ బద్యముల్ సెప్ప, నా
చింతం దీర్చుట నీకు శక్యమని యే చెప్పం దొరంకొంటి, నీ
స్వాంతం బించుక పుత్రుపై నిలిపి వాంఛాపూర్తి సేయంగదే!
సంతానంబు నిరోగమైన భవమే స్వర్గంబు కామేశ్వరీ.

శా. పద్యమ్ముల్ రచియించి కోరితి నిఁకన్ బ్రారబ్ధకర్మక్షయం
బిద్దాసం గలిగించి వే సుతున కాయీరోగముం బాపి దీ
ర్ఘ్యద్దేహుం బొనరించి ప్రోవుము; కవిత్వం బిద్ది లోకమ్ములో
"సద్విద్యావశ" మన్న పేరున యశస్యంబౌతఁ గామేశ్వరీ.

శా. ఆయుర్దాయము లేనివారలకె తా నాయుష్ప్రదెన్ భర్త, త
జ్జాయాత్వమ్మున కీవు తావలమవై సంపన్నమా నాయువున్
జేయంజాలవె! రోగదూరముగ, నీచిత్తమ్ము రా కిన్ని నా
శ్రేయాస మ్మొదవెన్, ఘటింపు మిఁక సౌఖ్యం బంబ! కామేశ్వరీ.

మ. శతకమ్మున్ రచియించి సూర్యపయిఁ గుష్ఠ మ్మొడ్చె నొక్కండు, ప
ద్యతతి న్నిన్ను నుతించి మూఁగతనమున్ దాఁ బాసె నొక్కండు, ని
శ్చిత మీసంగతి, మున్ను నీకతననే జీవించితి న్నేను, మ
త్సుతు నారోగ్యము నీకతాన నగు టే చోద్యమ్ము? కామేశ్వరీ.

శా. అంబా! యెందుల కిచ్చి తిట్టిసుతు, ని న్నర్థింపలేదే! మనీ
షం బూర్ణుండని సంతసింతునో, గురుశ్వాసార్తుఁ డంచున్ విచా
రంబుం బొందుదునో, షడబ్దముల కుబ్జుం డేడ! యీరోగదా
ర్ఢ్యంబుం దా నది యేడ! బిడ్డనికి సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ. 15

శా. పాపం బీయది నాయొనర్చినదియో, బాలుండె తాఁ జేసెనో!
రేపున్మా పితులైన నెట్టు? లిది వారింపంగదమ్మా! సుదు
ష్ప్రాపం బుండదు నీకు, నీచరణమే ప్రా పన్యథా లేదు, నా
తాపం బాపఁగదమ్మ! కుబ్జునికి మోదం బిచ్చి కామేశ్వరీ.

మ. పడలే కారయలేక యిర్వురము నిన్ బ్రార్థించుచున్నార; మీ
చెడురోగమ్ము దొలంచి పుత్రుని సుఖాశీర్యుక్తుఁ గావించి నా
యెడఁదన్ సంతసపెట్టు, మన్యగతి లేకే నిన్ను యాచించితిన్
జడ వింకన్ బొనరింపకే యుడుపు నాతాపమ్ము కామేశ్వరీ.

మ. కొడుకుల్ గల్గనినాఁడు బుద్ధియయినన్ గొండంతగాకున్న న
ల్గడలం గొండొకరైన సాయపడి నాకార్యమ్ములం దీర్చుచుం
డెడి, దీపుత్రకుఁ డుద్భవించియు రుజానిర్మగ్నుఁడై బుద్ధికిన్
జడఁబాటున్ ఘటియించెఁ, గుబ్జునికి మోదం బిమ్ము కామేశ్వరీ.

మ. మును పీరోగము "వెన్ను కొంత ముదురం బోవున్ ధ్రువం"బంచుఁ జె
ప్పిన వైద్యోక్తుల నూఱడిల్లితి నెటో; వెన్నట్టులౌ మీఁదఁ ద
గ్గని యీదగ్గున కేను బెగ్గలిడి నిన్ దక్కంగ వేఱొక్క ది
క్కు నపేక్షింపనివాఁడనైతి, ధృతి నాకుం గూర్పు కామేశ్వరీ.

మ. అరిగెం బో యయిదేఁడు లెట్లొ, శశి యల్లంతన్ జనెన్, బిమ్మటన్
ధరణీసూనుఁడు వచ్చె, "నింక నురుఁగున్ ద"గ్గంచు నే నుండఁగా
నురుఁగన్ లేదు సరేకదా, మిగుల హెచ్చెం జూపఁగాఁజొచ్చె నీ
కరుణాదృష్టియె పుత్త్రుఁ బ్రోవవలె నింకన్ దల్లి! కామేశ్వరీ. 20

మ. జననీ! యేఁబదియైన ప్రాయమున నీసంతానదూరోగచిం
తను జేకూర్చుట నీకు ధర్మమగునే? 'ధన్యుండు వీఁ'డంచు భూ
జను లెన్నన్ భవదీయసత్కరుణచే సంసారినై యుంటిఁ, బు
త్రున కారోగ్య మొసంగి నన్ను నుతిపాత్రుం జేయు కామేశ్వరీ.

శా. తల్లీ! త్వత్పదభక్తులౌ జనుల సంతానం బరుగ్ణంబు సం
పల్లీలాకలితంబు నంచుఁ దెలుపున్ బ్రాచీనపుంగబ్బముల్;
దెల్ల మ్మీ నుడి మత్కుమారునెడ వర్తింపన్ వలెన్, దాన భ
క్తోల్లాసమ్ము ఘటింపఁగావలయుఁ జు మ్మోయమ్మ! కామేశ్వరీ.

శా. భక్తుల్ రక్తులె యై తదాత్మజులు సంప్రాప్తార్తులే యైనచో
'భక్తార్తిప్రద' యన్న దుర్యశము సంప్రాప్తించు నీకున్, ద్వదా
సక్తిన్ మానుదు రెల్ల, రట్లగుట నిచ్చల్ భక్తసంరక్షణా
సక్తిన్ వీడకుమమ్మ! నీకిది యశస్యం బమ్మ! కామేశ్వరీ.

మ. శని బల్ దోషి, కుజుండు పాపి, రవి దుస్సంచారి, జీవుండు దు
ర్మనసుం డైన మతేమి నాకొమరు సంరక్షించుభారమ్ము నీ
పనియైనప్పుడు భీతి యేమిటికి? నీపట్లన్ గ్రహంబుల్ భయ
మ్మున నీభక్తుల కిచ్చు నిచ్చలు సుఖంబుల్ తల్లి! కామేశ్వరీ.

శా. ఈజన్మంబునఁ గొంచెమే యనుము మున్నే జన్మమందేని నీ
పూజం బూర్తిగ సల్పి వీఁ, డది కతమ్మం జేసియే లోకమున్
బూజించెన్; గొమరుండు రుగ్ణుఁడగుటే పో! లోప మిప్పట్ల, నీ
తేజంబే కల దద్ది పుత్రు సుఖిగా దీవించుఁ గామేశ్వరీ. 25

మ. ఇలువేల్పైనకతాన నీచరణమే యాద్యంబు మావంశమం
దలి యేకానకువైనఁ గాని, యిది క్రొత్తా? మా కొలమ్మెల్ల నీ
చలువం జేసియె వృద్ధిగాంచెఁ; గొమరున్ సాకంగదమ్మా! రుజా
బలమున్ దింపఁగదమ్మ! పుత్రుఁ గరుణింపన్ రమ్మ! కామేశ్వరీ.

మ. ఒకపూటో, యొకరేయియో, పగలొ! యీయుద్రేకపుం దగ్గు ద
గ్గక కుఱ్ఱండు సుఖమ్ముగా నెసఁగ "మాకామేశ్వరీదేవి పు
త్త్రకు రక్షించె" నటంచు, మీఁద మరలన్ దగ్గన్ మొదల్వెట్ట "దే
వి కటాక్షింపద యింతదన్క" ననుచున్ వీఁ డుండెఁ గామేశ్వరీ.

చ. జననీ! లోకములోని బాలకులు నిచ్చల్ దగ్గరే? యట్లు ద
గ్గిన నే నింతంగ మొఱ్ఱవెట్టెదనె? యీ కిగ్గాడిమార్గాల ని
స్వనమున్ నే వినఁజాల, దీని నణఁగింపన్ లేవె? ని న్నేను వేఁ
డిన దీమాత్రమకాదె? నీ కిదియు గడ్డే? తల్లి! కామేశ్వరీ.

మ. అనిలో మున్ను బిడాలరాక్షసుని దుర్వ్యాహారముల్ రూపుమా
పినమాటే నిజమేని నేఁడు కొమరున్ బీడించు నీ పిల్లికూఁ
తను వారింతువు; దానఁజేసి మదపత్యం బున్న తానందమున్
గను, నిన్నుం దనియింతు నే నపుడు వేడ్కల్ మీఱఁ గామేశ్వరీ.

శా. "తగ్గుం ద"గ్గని యంటి "దేవిపయిఁ బద్యాల్ సెప్పినా"నంటి "వే
తగ్గుం గన్పడదేమి? తండ్రి!" యనుచున్ దర్కించెఁ గుఱ్ఱండు, బల్
సిగ్గయ్యెన్ జెఱవాఁడు గూడ వినుటన్, లేలెమ్ము రారమ్ము నా
సిగ్గున్ నాసుతు దగ్గునున్ దొలఁచి రక్షింపంగఁ గామేశ్వరీ. 30

మ. చదువన్ వేయఁగ యుక్తకాలమని యాసంస్కారమాత్రంబ య
య్యదనన్ దీర్చితిఁ; గుఱ్ఱనిన్ బడికి నే నానాఁటి కీనాఁటికిన్
బదమం చన్నది లేద, యన్నిటికి నీశ్వాసామయోద్రేకమే
కద విఘ్నం! బిది వాపి విద్య నొసఁగంగాఁ జూడు కామేశ్వరీ.

మ. ఎపుడో నీకృప రాఁ బ్రయోజనము లే దీబాలుపై, విద్య నే
రుపుకాలం బది దాఁటిపోవుపయి నీ రుగ్ణత్వముం బాపి నీ
కృప సూచింతువుగాక యక్కరము లెక్కింపం గడుంజిక్కు, "గో
టిపనిన్ గొడ్డటి" కేల తార్చెదవు? నేఁడే చూడు కామేశ్వరీ.

శా. "ఆలస్యా దమృతం విషం" బనెడి సిద్ధాంతోక్తి నీ వొప్పచో
బాలున్ వే గరుణింపుమమ్మ! సుకలాభ్రాజిష్ణుఁ గావింపు మ
మ్మా! లోకుల్ నను "నీదుభక్తుఁ" డనుచున్ మన్నించుసందర్భమున్
బాలింపంగదవమ్మ! నీయుపకృతిన్ వర్ణింతుఁ గామేశ్వరీ.

శా. "ఎన్నం డీ చెడుదగ్గు తగ్గు" నని న న్నెల్లప్పుడున్ బృచ్ఛసే
యు న్నాబిడ్డఁడు, "కొన్ని నాళ్ళ"కని నే నోదార్తు నవ్వాని; నా
పన్నార్తిప్రశమౌషధాయితము నీవాత్సల్య, మీ నాదు సు
క్తి న్నిల్పన్ వలె మత్కుమారకుని యార్తిన్ బాపి కామేశ్వరీ.

శా. అంబా! ని న్నెవఁడేని నమ్మి చెడఁ, డీ యర్థమ్ము నాకుబ్బుమీఁ
దం బాటించిన నీ కృపాకలనచేతన్ విస్ఫుటంబయ్యెఁ; బ
ద్యంబుల్ ముప్పదియైననాఁడు మొద లేతద్వ్యాధిభారంబు త
గ్గంబూనెన్, గొమరుండు గొంత సుఖిగాఁ గన్పట్టెఁ గామేశ్వరీ. 35

శా. ఇంతేకా దిటమున్న "మార్గ మిది" యం చేర్పాటు గాకుండె, నేఁ
డంతో యింతయొ మార్గ మేర్పడినయట్లై తోఁచె; నీమార్గ మీ
కాంతారాంతరచారినైన నను జక్కన్ గమ్యముం జేర్చి దు
శ్చింతాదూరుని జేయఁగాత! మిదిగోఁ జేమోడ్పు కామేశ్వరీ.

శా. ఇంతన్ "నన్నను వీడు వీఁ" డనుచు నీ వీక్షింపఁగాఁబోకు, నా
సంతానమ్మును బీడవెట్టురుజ నిస్సందిగ్ధమై వీడు న
ల్లంతన్ వీఁడు కవిత్వమున్ సలిపి నిన్ యాచించుటల్ మాను; "ము
ష్యంతం" బన్నది "దాసరేః పదము" నేఁడా పుట్టెఁ! గామేశ్వరీ.

శా. "సంతానమ్ము నొసంగితీరు" మని నిచ్చల్ నిన్నుఁ బీడింపలే
దెంతో కాల మపత్యభాగ్య మది లేకే యేగ, నల్లంతలో
సంతానంబఁట! కొంత నష్టమఁట! శిష్ట మ్మిర్వు, రం దగ్రజుం
డెంతే రుగ్ణతఁ గాంచఁ జూచి సయిరింతే? దేవి! కామేశ్వరీ.

శా. దేనిన్ గ్రొత్తగ "నాకు ని"మ్మనుచుఁ బ్రార్థింప న్నినుం దల్లి! యొ
ద్దానిన్ నీ విడితో యయాచితమ, తద్దన్ దానఁ దృప్తుండ; నీ
నై నా కిచ్చినదానికే సుఖజయప్రాగ్భార మర్థింతు, "నా
పై నీచిత్తము నాదుభాగ్యము" కృపం బాలింపు కామేశ్వరీ.

మ. తమకున్ దగ్గనిదానిఁ గోరుదురు సంతానంబు నెప్పట్లఁ బ్రా
జ్ఞమతుల్, దగ్గెడిదాని నెట్టి కుమతుల్ గాంక్షింప; రట్లౌట నో
యమ! యిందుంగల శ్లేష శ్లేష్మరుజయం దైనన్ సమర్థించి నా
కొమరుం దగ్గనివానిఁ జేయు మది నాకుం జాలుఁ గామేశ్వరీ. 40

మ. 'తమకుం దగ్గని యన్నచోట నుభయార్థమ్ముల్ "సుఖప్రాప్యముల్
కమనీయమ్ములు" నంచు నీవరయవే కళ్యాణి! నాతోఁ గలన్
గొమరున్ దగ్గనివానిఁ జేయుటయు దగ్గున్ మాన్పుటన్ గూడ యు
క్తము; పైసంగతికేమి, దగ్గు నిపుడే తగ్గింపు కామేశ్వరీ.

శా. అంబా! నీవగు భక్తమండలికి శ్రేయంబబ్బఁగాతన్, నిరో
గంబౌఁగాక తదాత్మజాతులకు; దీర్ఘంబైన యాయుష్యలా
భం బౌఁగావుత వారి, కియ్యదియ నాబాలున్ గృపన్ బ్రోచి న
న్నుం బాలించినదాని కేఁ దెలుపు సంతోషంబు కామేశ్వరీ.

శా. అంబా! నీకు జయమ్ము, నీసుతుల కత్యారోగ్యమున్, నీమన
మ్మింబాలించెడి శంభుదేవునకు నామోదమ్ము, నీ పాదయు
గ్మంబుం గొల్చెడి మాదృశప్రజకు సౌఖ్యం, బీవు మత్పుత్రుపీ
డం బోఁద్రోయుటఁజేసి నాసలుపునాట్యం బిట్లు కామేశ్వరీ.

శా. ఈవే పంపితొ, తానె వచ్చెనొకొ! దేవీ! కేరళక్ష్ముండు చి
జ్ఞాపూర్వ్యన్వయుఁ డర్చనాకుశలుఁ డారాధ్యస్వభావుండు సు
శ్రీవిష్ణుం డపమృత్యువారకుఁడు లక్ష్మీపత్యభిఖ్యుండు సౌ
ఖ్యావిర్భావుఁ డకారణంబ యిట, కంబా! నిన్న కామేశ్వరీ.

మ. అతఁ డేజాతకమున్ గనుంగొనక తా నాస్యమ్ము వీక్షించియే
గతమే కా కఖిలంబు నాగతము వక్కాణించు విజ్ఞుండు, మ
త్సుతునిం జూచి విశేషసంగతుల నచ్చంగూర్చినట్టుల్ వచిం
చి తగన్ శాంతికినై కడంగె, నిది నీ చేయూఁత కామేశ్వరీ. 45

శా. స్త్రీవిం గావు, పుమాకృతిం బొరయ, వీ చిహ్నద్వయాతీతసా
భావం బందవు, నిన్ను నెవ్వరని సంభావింతు నోతల్లి! భూ
దేవుల్ నీ నిజరూప, మింతు నహి సందేహంబు, మత్పుత్రకున్
బ్రోవంగా నిటువచ్చి తాత్మకపితన్ మోహాంతి కామేశ్వరీ.

శా. ఏరూపమ్ముసులేని తేజమున కేదే నొండు రూపమ్ము వ్యా
పారార్థమ్ముగఁ గల్పనన్ సలుపు టబ్రాహ్మైక్రనచో నెందు లో
కారాధ్యుల్ ధరణీసురప్రవు, లట నీ వైశ్యమ్ము గల్పించినన్
ధీరుల్ మెత్తురుగాన నిద్విజుల సందేహింపఁ గామేశ్వరీ.

శా. ఆయుఃశాంతులు నౌషధాదులును దానాదిక్రియల్ సర్వమున్
శ్రేయం బంద నిమిత్తమాత్రములు, నీ చిత్తమ్ము రా నన్నియున్
డాయున్ శ్రేయము లంచు నేనెఱిఁగియున్ ధైర్యమ్ము నిల్పంగ లే
కాయాతంత్రములన్ మెలంగుట మదంబా! ప్రోవు కామేశ్వరీ!

శా. నా చాపల్యము లెక్కసేయక యెటో నా బిడ్డనిన్ బ్రోచి నా
వాచాదోషములన్ క్షమించి కొమరున్ వర్ధిష్ణుఁ గావించి యీ
నీచశ్వాసరుజన్ హరించి జననీ! నేఁడెల్లి విద్యార్థిగా
నేచందమ్మున నో కృపన్ సలుపు, జాగింకేల? కామేశ్వరీ.

మ. ఇట మున్నంబ! భవత్కృపాకలన తా నీరీతిఁ గాకున్కి, ను
త్కటరోగాపనయప్రసక్తి మెయి విద్యాలబ్ధికై పొందు సం
కటపాటెల్లఁ దదార్తిఁ బెట్టునని నేఁ గైకొంచు నున్నాఁడ, నిం
తటనైనన్ గొమరున్ గలార్థి సలుపన్ నా కోర్కి కామేశ్వరీ. 50

శా. ఆరోగ్యమ్మును గూర్చి బిడ్డనికి నిత్యమ్మున్ బ్రయత్నించుచే
పారె న్నాపని యయ్యె, నీకృప నిఁకన్ శ్వాసామయ మ్మెట్టులే
నీరై పోయినఁ బాఠశాలకు సుతున్ బంపి కోనెంతు, నా
చారంబు న్నెఱవేర్ప నేనిఁ 'బితృదోషం' బండ్రు కామేశ్వరీ.

శా. శ్రేయస్సుల్ బహువిఘ్నముల్, బడు లెటో చేర్పాలు నేర్పన్, గళా
వ్యాయామమ్ములు దుర్లభమ్ములు, భవత్పాదాబ్జసక్తిన్ గురు
స్వాయత్తత్కరుణావిశేషమునఁ జూ ప్రాపించు విద్యాధనం
బోయమ్మా! యటు లూరకున్నఁ బిత నెట్లూహింత్రు కామేశ్వకీ.

శా. నీచేయంగల కార్యమంబ! కొమరున్ నీరోగుఁ గావించుటే,
నా చేయంగలకార్యమో! కల కొగిన్ యత్నించుటే, పిమ్మటన్
వాచామాధురి లోనగాఁ గలుగు సౌభాగ్యంబు ప్రాక్సంచిత
ప్రాచుర్యమ్మున నబ్బు, నేరిపశ మైశ్వర్యంబు? కామేశ్వరీ.

శా. 'విద్యాలబ్ధి పురాకృతానుగతమై పెట్టోక్కలా గెట్టులా
సద్యశ్శ్వాసరుజానివృత్తి' యనుచున్ శంకింతువో! "కర్మసం
పాద్యంబే సకలంబు" సత్యమగుచో భక్తుల్ నినున్ వేఁడి 'యా
పద్యోగమ్ములు వాసి' రన్న నుడి కెవ్వాఁ డొప్పుఁ గామేశ్వరీ.

శా. ఈపైఁ గొన్ని దినాలదన్క రుజ తా నేకొంచెమో నిల్వని
మ్మీపై మున్పటిరీతి కాఁదగదుసుమ్మీ ! తల్లి ! యట్లైనచో
నీపైఁ జెప్పిన పద్దెముల్ జగతిలో నింద్యమ్ములౌ, నాకు నీ
ప్రాపన్మాటయు మిథ్యయౌ, నెఱిఁగినన్ బాలింపు కామేశ్వరీ. 55

శా. నీ కారుణ్యము పుత్రుపైఁ గలిగెనేనిన్ బ్రాగ్జనుస్సంచితా
స్తోకైనఃపరికరప్రకల్పితరుజాదుర్దర్పముల్ దూరమై
సాకల్యమ్మగ స్రుక్క, నక్కతన నోశర్వాణి ! మద్వాణికిన్
నాకున్ నీకు యశంబు, బిడ్డనికి నానందంబు కామేశ్వరీ.

శా. ఏ యామద్వయవేళకో నిశిని దా నీయామయ మ్మెప్పుడున్
నా యాత్మోద్భవు నంటియున్నటులె కానన్ వచ్చెడిం దల్లిరో !
సాయమ్మం బొనరింపఁబూనినపు డీ జాగేల ? యీ దూరుజా
పాయమ్ముం దుదముట్ట నెట్టి కొమరుం బాలింపు కామేశ్వరీ.

శా. అమ్మా ! నమ్మిన నమ్మకున్న విను నాయాంతర్యమున్, దక్కరో
గమ్ముల్ కొండొక చిక్కువెట్టినను నీల్గం జేసినం గాని శ్వా
సమ్మం గాసము నాయుఃవుం బెనిచినన్ సాంతత్యముంజేసి క్రూ
రమ్ముల్, వీని నడంచి పుత్రుని గృపన్ రక్షింపు కామేశ్వరీ.

శా. ఆయుర్వృద్ధికి "సుబ్బసమ్మ గుఱు" తం చాయుఃకలావేదులం
దీయుద్దేశ మెసంగు నెల్లెడల, నీదృక్ఛ్వాసబాధాపరి
స్థాయద్దీర్ఘతరాయు వేమి ఫల ? మంబా ! పుత్రుదీర్ఘాయువున్
శ్రీయుక్తంబు నరుగ్ణమున్ సలిపి, నన్ జేపట్టు కామేశ్వరీ

శా. అంబా ! యుబ్బస మన్న దైవతము కా, దట్లయ్యు నాయుఃప్రదా
నంబుల్ సల్పెడినంట ! నీవో, జగదానందైకసంధానదీ
క్షం బాలించెడి మేటి దైవతమ, వీచండాలరోగంపు రూ
పంబున్ మాపి కుమారునిన్ మనుపలేవా ? సిగ్గు, కామేశ్వరీ. 60

శా. 'ప్రారబ్ధ' మ్మనునట్టి వాదమును నిన్ బాధింప; దేమందువా,
ప్రారబ్ధక్షయమైన హేతువుననే పద్యమ్ములం జెప్పఁగా
నారంభించితి నేమొ ! నీపయి; నిజం బౌఁగాక కాకుండుఁగా
కీర్తిగ్లప్మెటులేని నీ వుడిషినట్లే యెంతుఁ గామేశ్వరీ.

మ. "తిరుపత్యద్రిపతిన్ భజించుటలు నీదివ్యాంఘ్రిపూజల్ మహా
త్తరముల్, దక్షిన తీర్థయాత్రలును వ్యర్థ" మ్మంచు లోనెంచదే?
నరలోకం, బోక కర్మవాదమె జగన్నాథత్వముం బూనుచోఁ
బరిశీలింపుము పుత్రుఁ బ్రోవుము రుజన్ భంజించి కామేశ్వరీ.

శా. వేదాంతమ్ములఁ గర్మవాద మది యుర్విన్ సుప్రసిద్ధంబె, నీ
కాదుర్వాదముతోఁ బనే, మదియు నిన్నడ్డన్ సమర్థంబె ? ని
న్నే దీనమ్మగ వేఁడికొంటి, సకల మ్మార్నేర్తు వీ వెట్టులో
నాదుర్యోగముఁ బాపు, పుత్రు నరుజున్ గావించి కామేశ్వరీ.

శా. అంబా ! నీదగు మాయలోని నిజ మాపం తేనియున్ గానరా
మింటూజ్యల్ ఋషు లిన్ని మార్గముల నెమ్మిన్ ద్రొక్కి, రీవన్నఁ ది
మ్మిత్రం బమ్మిన్ మఱి బమ్మిఁ దమ్మిగను బల్మిన్ మార్పఁగా నేర్తు; శ
క్యంబే నీకఖిలంబు, పుత్రు నరుజుం గావింపు కామేశ్వరీ.

శా. తల్లీ ! యెల్లెడఁ గర్మవాదమె జయస్థానమ్ము గైకొన్న సం
పల్లాభమ్మునకై జయాప్తికిఁ గలాపారంపరీలబ్ధి కా
పల్లీనత్వనివృత్తికిం జనులు నిన్ బ్రార్థించుటల్ వెఱ్ఱియౌఁ,
గల్లా నీ నిజసత్త; కానఁ గొమరుం గాపాడు కామేశ్వరీ. 65

శా. 'మానుంబిల్లియొ ! మట్టుఁబిల్లియొ,' యగున్ మన్నించి మత్పుత్రకున్
నీనేర్పుంగతి నీరుజున్ సలుపుటే నిన్నేను బ్రార్థింతు, నీ
తో నాకేటికి శాస్త్రవాదములు, నాతో నీకుఁ బంతంబె ? నా
పై నీకుం గల ప్రేమ్మఁ జూపి కొమరుం బాలింపు కామేశ్వరీ.

శా. 'ఆరోగ్యం బిఁకఁ బూనె నంబ' యని నే నానందముం బొందఁగా
నారంభించితి, నంతలోన రుజ పూర్వాకారముం దాల్చె నేఁ,
డీరీతిం బలుసారు లయ్యె మును, పిప్డే క్రొత్త గన్పట్టె, నీ
కారుణ్య మ్మది రాద యింతదనుకం గల్యాణి ! కామేశ్వరీ.

శా. ఏమందో యినుమంత వాడునెడఁ దా నీరీతి యారోగ్యమున్
నేమమ్ముం గనుపట్టి మీఁద నెపుడో చీకాకుగా మాఱుటల్
నేమంబే మును పీరుజానుగతికిన్; నేఁడేమి నీసత్కృపా
సామర్థ్యమ్మున నయ్యె? నీకృపయె రాజాగయ్యెఁ గామేశ్వరీ.

మ. కరి రక్షించిన విష్ణు వుండ, నల మార్కండేయు రక్షించు శం
కరుఁ డుండన్, నిను దేవురించుకతముం గన్పట్టి ‘మాయింటి దే
వర’ వన్ సంగతి జ్ఞప్తిఁదెచ్చికొని, నాబాలుం గృపంజూచి యీ
గుజికన్ మాన్పఁగదమ్మ! యిష్టయిన జాగున్మాని కామేశ్వరీ

మ. ఇలువేల్పాటనె శంకరాదుల మదిన్ వీక్షింప కీనిన్ను ని
చ్చలు వేధించుటగాదు, ‘తండ్రికరుణన్ సాధించుకన్నన్ గడున్
సుఖవాఁ డల్లికృపం గడించు’ టనియున్ జు; మ్మట్టిచో జాగిటుల్
సలుప న్యాయమె? బిడ్డపైఁ గృప నొగిన్ సాగింపు కామేశ్వరీ. 70

మ. ఇతరోపాయ మొకండు కల్గునెడ నిన్నేవ్వాఁడు వేధించు? మ
త్సుతు నారోగ్యముకోస మెన్నిగతులో శోధించి శోధించి, పై
నితికర్తవ్యము ‘నీ పదాబ్జభజనంబే’ యంచు లో నెంచి, నిన్
బ్రతిమాలం దొరఁకొంటి; నాసుతు నొగిన్ బాలింపు కామేశ్వరీ.

మ. ఇలువేల్పా నిను వీడి యేసురలనో యే నిప్డు వేఁడంగ, ‘మీ
యిలువేల్పుండఁగ మా కి దేటిగొడ’ వం చేమందురో వారు! నా
కలుషమ్ముల్ హరియించి, నాకొమరుపైఁ గారుణ్యము న్నించి మేల్
బల మారోగ్యము నీవ యీవలెఁజుమీ, ప్రార్థింతుఁ గామేశ్వరీ.

మ. ‘ఇలువే’ ల్పంటకు నర్థమేమి చెపు! మోయీశాని! తన్ గొల్చు గే
స్తులఁతం జెందక యుండఁ జూచుటయుఁ దా నద్దాన నవ్వాని పూ
జలు గైకొంటయుఁ గాక యన్యమగునే? శ్వాసామయం బూడ్చి ని
చ్చలు నాపుత్రుని బ్రోచి నాసలుపునర్చల్ గొమ్ము కామేశ్వరీ.

మ. ‘నను వేధింపఁగఁబోకుమీ రుజలకు న్నా కేమిసంబంధ? మే
జనుకర్మ మ్మెట్టువంటి దట్టిద రుజాసంసర్గమౌఁ, దత్క్షయ
మ్మున నారోగ్యము గల్గు’ నం చనెదవేమో! యట్టిదేయైన నే
నిను వీడన్, విడి నాయొనర్చుపనియున్ లే దంబ! కామేశ్వరీ.

శా. “నీకన్నం బిడఁ బెద్దయె” ట్టనుటయున్ “నేఁ డింగు నేఁ దిందు” నం
చాఁకొన్నాతఁడుగూడ నొట్టిడుక తా నచ్చోటనే మెక్కిన
ట్లీకర్జమ్మున బండయాచకుఁడనై యే నిన్ను నిర్జింతుఁ జా
మ్మొకల్యాణి! సుతార్తిముక్తి తెర వొం డూహింపు కామేశ్వరీ. 75

శా. "నీకుం బోవదు నాకుఁ బోవదు" వృథా నీకేల జాలంబు ? యా
చ్నాకార్యంబు "పురస్కృతౌవమతి పశ్చాత్ క్లప్తమానం" బటం
చీకాలమ్మునఁ గాద, పూర్వయుగమం దెందుం బ్రసిద్ధంబ యం
బా ! కాఠిన్యమి దేల ? బిడ్డనిఁ గృపం బాలింపుఁ గామేశ్వరీ.

శా. ఏకోశమ్మున నేనియుం దయ లవంబే నున్న వేల్పునిఁ దా
నేకొంతేనియు గర్భయాచకునిపై దృష్టిం నిగుడ్చుం ఘృణం,
బీకార్యమ్మున గర్భయాచకుఁడ, నా కిమ్మాప్సితం బివ్వఁడే,
లేకున్న న్నిను వీడఁ, బుత్రుఁ డెటు తల్లిం వీడుఁ! గామేశ్వరీ.

మ. గతి వేఱొక్కటి లేక పుత్రు నరుజుం గావించుభారమ్ముఁ బూ
న్చితి నీపై; నటు నీకృపాగరిమ వానింజేయుచో వాఁడు "పం
డితపుత్రుం" డను దుర్యశంబు గన, కా నిందోక్తి నాయందు సం
గతమై సద్యశ మబ్బఁజేయుసొబగుం గల్పించుఁ గామేశ్వరీ.

మ. అతిథుల్ వచ్చిన గారవింపనో ? యథార్థాంబుల్ నివర్తింపనో ?
మతి నీపై భయభక్తిసంభ్రమము లేమాత్రమ్మునుం లేవో ? దు
ర్గతులం జూచి విచారమందనో ? వృథాగా నేటి కోయమ్మ ! నా
సుతు రుగ్ణుంబొనరించి నాహృదయమున్ శోధింతు, కామేశ్వరీ.

శా. నాయారోగ్యమునందు లోపశతమున్ గన్పట్టనీ నీకు నే
నాయాసం బిడి పీడగొల్పుటలు లే, దాత్మోద్భవుం గూర్చియే
నే యాచించుట; వ్యాధి యొందనుక వాని న్మించు నందాఁక నీ
కీయాచ్నా పరిపీడ తప్ప, దిఁక నీయిష్టంబు కామేశ్వరీ. ౪౧

శా. కాసశ్వాసలనైన నైఁచి నిలువంగావచ్చు నొక్కింట, యా
చ్నాసారస్యనిరాదృతిప్రచలదుచ్ఛ్వాసంబు సద్గోత్రజుం
డై సైరించినవాఁడు గన్పడఁడు, నీ కంబా ! యసద్గోత్రజా
భ్యాసం బేటికి ? వేగ నాకొమరునిం బాలింపు కామేశ్వరీ.

మ. నెలకేనిం మును రెండు మాసములకేనిం మూఁటికే నెడ్డా యీ
పిలికూఁతల్ వినసై చికిత్సకతనం బీడించుటల్ మానుటల్
గల, దిడ్డో పగ్రితిరాత్రియుం గనఁగనై కారింపఁగాఁజొచ్చె; నీ
కలిపార్తిన్ హరియించి నాకొమరునిం గాపాడు కామేశ్వరీ.

శా. అంబా! యేఁబది వత్సరమ్ముల వయస్సాయెన్, సుఖంబుల్ దద
న్యంబుల్ మున్ననుభూతముల్, నిజముగా నాజన్మమం దిట్టి క
ష్టంబా కాలము చూడలేదు, సుతుఁ డీశ్వాసామయం బూడ్చి సౌ
ఖ్యంబున్ నాకిడనోపు, నయ్యది త్వదాయత్తంబు కామేశ్వరీ.

శా. నాకుఱ్ఱన్ సుఖిగా నొనర్చి యిటుపై నాకుఱ్ఱకేకాక యీ
పాకమ్మం బగవానిబిడ్డకయినన్ వర్తింపనీకమ్మ! నే
నే కాదంబరో! నీవుగూడఁ గొమరుం డిట్లార్తుఁడే యైనచోఁ
గైకోలేవు సుఖంబు; నాకొమరునిం గాపాడు కామేశ్వరీ.

శా. దగ్గన్ సూచన యైనవెంటనె మదిం దాపోదయంబౌ, మఱిన్
నిగ్గుల్ దేరినమానసం బఖిలమున్ నీకౌ, బిడాలవ్యధుల్
ఒగ్గం దోఁచినఁ గోప ముప్పతిలు నో విశ్వాంబ! నన్నీగతిన్
సగ్గంజేయక పుత్రునిన్ మనిచి యాశ్వాసింపు కామేశ్వరీ. 85

మ. "ఇది యేమో! పొనరించు" నంచు మదిలో నేమేని భీతిల్లి నీ
దు దయన్ వేఁడుట గాదుసూ, జనని! మృత్యుప్రాపకం బిద్ది గా
దెదుగున్ దీనికతాన నాయుఁ; వగుఁగా, శేలాభ మీజీవనం?
బదయత్వమ్మ వహింప కార్తి నుడుపన్ యత్నింపు కామేశ్వరీ.

శా. సంగీతమ్మున యందు సాహితియెడం జాతుర్య మెట్లేని య
బ్బుంగా కంబరో! వాక్ప్రవాహ మెటు లుప్పొంగున్? రుజామాత్రమే
యంగీకారము గాదు, శ్వాసరుజయో! యత్యంతశత్రువ్రజం
బుం గైకోఁదగ, దీ రుజన్ మలపు మబ్బున్ హాయి కామేశ్వరీ.

శా. విద్యాగోష్ఠికె కాద, యేపనికిఁ బృథ్విన్ రోగి పాత్రుండు గాఁ
డుద్యచ్ఛ్వాసరుగార్తుఁ జెప్పవలెనే? యోయమ్మ! నీకేల నా
పద్యంబుల్ మొఱపెట్టికోవలయు సర్వజ్ఞత్వ మున్నప్పు, డిం
కుద్యోగించి కుమారునిన్ మనుచు చొప్పూహింపు కామేశ్వరీ.

శా. నా యీప్రస్తుతదుస్థితిన్ గనినచో నాతల్లి! సంతానమం
దేయజ్ఞుండును వాంఛఁబూనఁ, డిది యేమో? నీదయోద్రేక మి
ట్లాయె న్నాయెడ, జీవితంబు తుద కిట్లా నేను వేగించుటల్?
"ఛీ" యన్పింపక వేగ నాకొమరుగాసిన్ మాన్పు కామేశ్వరీ.

శా. అంబా! మార్గమొకండు చిక్కె" నని నే నానందముం జెంది ప
ద్యంబు న్నీపయిఁ జెప్పి రోగతరణం బర్థించితిన్ మున్ను, వి
ఘ్నంబుం దానికి సంతరించి, తయినం గానిమ్ము వేఱొక్క మా
ర్గంబు న్నీవ యనుగ్రహించి కొమరుం గాపాడు కామేశ్వరీ. 90

శా. ప్రత్యక్షమ్మయి దేవతల్ నొడువు టీ పాపిష్ఠకాలమ్మునం
దత్యంతమ్ము నసంభవం బగుట స్వప్నాదిస్థితిన్ జెంది సా
మత్యంబూని సుతార్తివారణకు నంబా! యొం డుపాయమ్ము మ
ద్భృత్యంతప్రపణమ్ముగా నొడువరాదే? దేవి! కామేశ్వరీ.

శా. చోటున్ మార్చిన "వ్యాధి తా సురుఁగు" నంచున్ వైద్యు లంచుండి రీ
మాటన్ బట్టి చరింపుమందువో? యెదేమం దీడనే వాడ నా
నాఁటన్ గల్గు నరుగ్ణభావ మనెదో? నాతల్లి! సూచించి యా
రాటంబుం దొలఁగించి బిడ్డనిఁ గృపన్ రక్షింపు కామేశ్వరీ.

శా. ఇచ్చోటం గల, వచ్చటన్ గలవు, నీ వెచ్చోట లేకుంటి! మ
మ్మిచ్చోనుంచి నిరామయత్వపద మీ విప్పింపలేవొక్కొ! నీ
యిచ్ఛన్ సర్వము సిద్ధమౌ, నిది నిజం బీక్షింపు మీవంక, కీ
యుచ్చైశ్ఛర్దారుజ బిడ్డనిన్ విడిచి యెందే డిందుఁ గామేశ్వరీ.

శా. ఆర్తుల్ లోనగువారు నిన్నడుగు టాయాకోర్కుల న్నీ వొగిన్
బూర్తింజేయుట సుప్రసిద్ధమకదా! పూజింతు నిన్ మత్కుమా
రార్తిం బాపఁగదమ్మ! వీనికిఁ గలాభ్యాసావకాశంపు వి
స్ఫూర్తిం దేఁగదవమ్మ! నీదుపదముల్ పూజింతుఁ గామేశ్వరీ.

శా. అంబా! యీరుజ యన్న నీ కల లులాయంబో! బిడాలంబొ! యా
లంబుం జేసి మరల్పఁగావలెనె? హేలామాత్ర సాధ్యంబ, నీ
చం బీరోగము, నీకటాక్ష మఱిసీసం బేసియుం జాలు దీ
నిం బోకార్పఁగ మత్కుమారునకుఁ శాంతింగూర్పఁ గామేశ్వరీ. 95

శా. సృష్టింపన్ భరియింప శక్తిగల నీదృక్కోణప్రఁగమ్మె కే
కష్టం బీరుజ మాన్పుటన్న, గళలగ్నక్ష్వేళుఁ డీశుండు నీ
దృష్టింజేసి యెకాదె మృత్యుజయ మర్థిన్ జేసి వర్ధిష్ణుఁడై
హృష్టింగాంచెఁ, గటాక్షముంచి కొమరున్ బోషింపు కామేశ్వరీ.

శా. రక్షింపంగలవే నెఱుంగుదును, గ్రూరమ్మైనయీరోగముౝ
శిక్షింపంగల, వంతెకాదు కొమరుౝ జేతోముదమ్మొప్పఁగా
వీక్షింపంగల, 'వింటివే' ల్లనుచు మాపెద్దల్ వృథా గొల్చిరే?
సాక్షాత్కల్పక మీవు, పుత్రు మనుపౝ జాగేల? కామేశ్వరీ.

మ. వయసిడ్డేఁబది దాఁటు నావిషయమై ప్రార్థింపఁగాఁబూనుచో
నయవేదుల్ విని సమ్మతింపరు, సరే; నాపుత్రునిం గుజ్జునిం
దయతోఁ బ్రోచుట సర్వసమ్మతముకాదా? తల్లి! కొంకేల? బల్
రయమొప్పన్ రుజ మాన్చి చేవనిడి కుజ్జున్ బ్రోవు కామేశ్వరీ.

శా. పాలన్ ముంచిన నీట ముంచినను నీపాదంబె దిక్కమ్మరో!
చాలున్ మూలము లేని యీరుజను 'నిష్కాసింతు' వంచెంచి ప
ద్యాలన్ నీవయిఁ జెప్పినాఁడ, నపహాస్యత్వమ్ము చేకూర్తువే?
చాలున్ జాలు రుజాపనుత్తికి నిఁకం జాగేల? కామేశ్వరీ.

శా. ఆరోగ్యమ్ముల రారు నాయువులు సౌఖ్యమ్మిచ్చు, నారోగ్యవి
స్తారంబై యొసలారు సంతతియె మోదంబిచ్చు, నారోగ్యసు
ర్వారంబై తనరారు సంపదయె సర్వమ్మిచ్చు, నారోగ్యమే
కోరంగాఁబడె నాదుసంతతికి నీకుౝ మ్రొక్కి కామేశ్వరీ. 100

శా. నీపై భారమువెట్టి యీ శతకముౝ నీకిచ్చితిన్, దీని నిం
కీపై వ్యాపృతి నందఁజేసెదను, నీవే కీర్త్యకీర్తుల్; రుజా
సాపత్న్యంబుఁ దొలంచి యాయువునెడౝ సంపూర్ణతం బెంచి స
ర్వాపత్తుల్ దొలఁగించి పుత్రు మనుపం బ్రార్థింతుఁ గామేశ్వరీ.

శా. రక్తిౝ జెందఁగ ముక్తిఁబొందఁగ రుజారాహిత్య మింపొందఁగా
భక్తిన్ జిందఁగ నాకు సర్వమునకున్ బద్యమ్ములే దిక్కు, నా
వ్యక్తావ్యక్తత లీ వెఱుంగుదువు బాల్యమ్మాదిగా; రోగని
ర్ముక్తుౝ బుత్రు నొనర్పు మీశతక మామోదించి కామేశ్వరీ.

శా. అంబా! యీశతకావసానసమయమ్మందుౝ యతీశుండు వ
చ్చెం బూజించితి, మద్గృహమ్మునన నిల్చెం గొన్నినా; ళ్ళప్డు శ్వా
సంబున్ గాసముఁ బుత్రు నొంచుతఱి, తత్సంయమ్యధీశాంఘ్రినీ
రం బిం తిచ్చితిఁ, బైనిఁ గన్పడె సుఖారంభంబు కామేశ్వరీ.

మ. ఒకపక్షమ్ము గతించె నిప్పటికి, నంతో యింతో యేమందొ పు
త్రికు నాకించుచునుంటి, సౌఖ్యముగఁ గష్టం బొప్పుచున్ బాలకా
లకుఁ దాసై చనుచుండె, నీవ యతిలీలన్ బ్రోచితం చెంతుఁ బు
త్రికు నారోగ్యము శాశ్వతంబు సలుపన్ బ్రార్థింతుఁ గామేశ్వరీ.

శా. దేవబ్రాహ్మణభక్తి యీయుగమునందే తక్కువై పోయె, నిం
దేవాఁడేనియు మగ్నుఁడౌనెడల "వీఁడే వాతులుం" దండ్రు; పై
నీవున్ వారికి సాయమానెడల వేఱే చెప్పనా భక్తపా
ట్లో విశ్వాంబ! కుమారు మన్చి నను ధన్యుం జేయు కామేశ్వరీ. 105

మ. కలికాలమ్మునఁ గూడ వేలుపుఁగృపల్ గష్టమ్ములం దీర్చుటల్
గల దన్నందుకు నిద్ది లక్ష్యమయినం గావచ్చు, నీ రోగదు
ర్బలమున్ మాపి కుమారునిన్ మనిచి మేల్ ప్రఖ్యాతి గైకొమ్ము, న
న్నలరంజేయుట కీర్తికిం దెగవు సుమ్మా, యమ్మ! కామేశ్వరీ.

శా. గోచారాదిక మింతకన్న నిఁకమున్ గ్రూరమ్ముగా నున్నటుల్
దోఁచున్, నీ కరుణాకటాక్ష మది పుత్రుం బ్రోవనున్నప్పు డా
యీచారమ్ముల లెక్కయేమి? యభయంబే యింక మాకున్, సుఖ
ప్రాచుర్యంబ భవిష్యదర్థమని సంభావింతుఁ గామేశ్వరీ.

శా. శాంతిం జెందినయట్టులుండి మరలన్ శౌర్యంబుఁ జూపించె మొ
న్నంతో యింతయొ యీ రుజాప్రసరణం; బడ్డట్లు వారించి
స్వాంతం బేమ తెనొక్కొ! బండ యిది, యీ చండాలరోగంబు త్వ
త్ప్రాంతంబంద యడంచిపట్టవలె భద్రం బంబ! కామేశ్వరీ.

శా. అంబా! పద్యమె చెప్పఁగోరి యొకపద్యంబేనియుం జెప్ప వాం
ఛం బూరింపని శ్రోఁడు లేఁ డెచట నో శర్వాణి! నీమీఁదఁ బ
ద్యంబుల్ నూటికి మించఁ జెప్పితిని బుత్రారోగ్యసంసిద్ధి వే
గం బాటిల్లుత, నీకృపన్ నెగడుతం గావ్యంబు కామేశ్వరీ.

శా. 'ఈపద్యమ్ముల పట్టు పెట్టి, దివి యీకృత్యమ్ము సాధించె, నే
రీపద్యాళిఁ బఠింత్రు శ్వాసరుజ వారే నాడునుం గాంచ' రం
చేపట్లన్ గొమరుండు శిష్యులును సర్వేద్యమ్ముగాఁ జెప్పికో
నీపద్యమ్ములకుం జయ మ్మొసఁగు మో యీశాని! కామేశ్వరీ. 110

మ. చెవుడేనిం గలిగింపుమమ్మ ! సుతుపైఁ జేసాచు మార్జాలపున్
రవమేనిం దొలఁగింపు; మిద్ది పితృకర్ణస్ఫూర్జధుప్రాయ, మీ
రవ మేతండ్రి సహించు ? దీని మదగర్వ మ్మాడ్చి మత్పుత్రకున్
శివమారోగ్యమొసంగి ప్రోవఁదగదే ! శ్రీమీఱఁ గామేశ్వరీ.

మ. జననీ ! నీకృపకల్మి శత్రువుల నిచ్చల్ గెల్చితింగాని పు
త్రుని బీడించెడి శ్వాసరోగమయశత్రుం గెల్వలేనైతి నిం
దనుకన్; దీని కుపాయముం దెలిపి నాతాపమ్ముఁ బోకార్చి కు
ఱ్ఱని కారోగ్యమొసంగు మియ్యదియ నిన్ బ్రార్థింతుఁ గామేశ్వరీ.

శా. ఏకార్యమ్మున కేను బూనినను దల్లీ ! నీదయోద్రేకను
శ్రీకల్మిం దనయంతఁ దా నయినటుల్ సిద్ధించులేకాని యీ
చీకాకిప్పటి కే నెఱుంగ, నెటులో చేపట్టి రక్షించుటల్
నాకు న్నీకును నాకుమారునకు ధన్యత్వమ్ము కామేశ్వరీ.

శా. ఎన్నం గుఱ్ఱనిజాతకం బొకటి కా దీశాని ! నీజాతక
మ్ము న్నాజాతక మిన్ని చక్కఁబడినం బూర్ణమ్ముగుం గోర్కి యం
చు న్నాకున్ విదితంబ, నీకరుణ కెచ్చో లే దసాధ్యం బటం
చు న్నానమ్మిక, బిడ్డపైఁ గరుణ వచ్చుంగాక కామేశ్వరీ.

శా. లే కెన్నాళ్ళులో లేకలేకయె భవల్లీలాకృపావాప్తిచే
నీకుఱ్ఱం డుదయింప నేమిటికి ? వీఁ డీలాటిఘోరామయ
ప్రాకట్యమ్మునఁ జిక్కనేమిటికి ? నాపాపంబొ ! నీలోపమో !
నా కీతాపము వాపకుంటివిగదా, నాతల్లి ! కామేశ్వరీ . 115

శా. సన్యాసంబు వహింపు మందువో ! గృహాసక్తిన్ విసర్జించి యీ
యన్యాయమ్మును జూడఁజాల కెటకే నల్లంతఁ బొమ్మందువో !
మున్యారాధితమైన నీదు మహిమమ్మం గూడ నాబిడ్డకుం
ధన్యత్వ మ్మిడఁజాలకున్న నిఁక నా దారేది ? కామేశ్వరీ.

మ. చదువున్ నేర్పుట పథ్యపానములు నిచ్చల్ నేర్పుటే, నీతులన్
గుదురం జెప్పుట చుట్టకాల్పువయిఁ గోర్కుల్ గొల్పుటే కాఁగ నా
కుదయించెం గొమరుండు, నీదయయొ కర్మోద్రేకమో హేతువై
రొదియుం దోఁపదు, నిద్రలేదు నిశలం; దేమందుఁ ? గామేశ్వరీ.

మ. పగటన్ నిద్దుర, రాత్రి జాగరణమై, ప్రారబ్ధకర్మక్షయం
బగుపట్టం దుదిలేక నాపడెడి కష్టావస్థ నీచిత్త మె
ప్పగిదిం దాఁ జొరదయ్యె, నాసలుపు నీపద్యమ్ము లెల్లన్ వృథా
యగునో! లేక ఫలించునొక్కో కృతకృత్యత్వమ్ము! కామేశ్వరీ.

శా. అంబా! యీరుజచేఁ జరిత్రపురుషుండై యొప్పెఁ గుఱ్ఱండు, ప
ద్యంబుల్ నీపయి నిన్ని వీనికయి చేయంబూనుటే దూరుజా
సంబంధమ్మునఁగాదె చేకుఱె! భవిష్యత్కాల మారోగ్యభో
గ్యం బౌఁగాక, గతమ్ము సర్వము నగణ్యంబౌతఁ గామేశ్వరీ.

మ. ఎవ రెట్లున్నను దేశపర్యటనమం దే నుండు నారోజులన్
లవలేశమ్ము విచారమే యెఱుఁగ, బాల్యంబాదిగా దేశముల్
కవితాకేళికిఁ ద్రిప్పిత్రిప్పి, యిపుడేకా యిల్లుపట్టించి! తీ
తెవులా యింతటఁ జిన్నికుఱ్ఱ! కిఁక నేదీ దారి? కామేశ్వరీ.

మ. అరియేనిన్ శ్రమమందుచున్నయెడ నే హర్షింప, నిక్కమ్ము దా
నెఱుఁగు న్నీమది, శ్వాసకాసల నిటుల్ కృచ్ఛ్రాతికృచ్ఛ్రమ్ముగా
మురిపెంపుం గొమరుండు కస్తివడ, నాప్రోఁ తెట్లు నే విందు? నె
క్కరణిన్ సంస్కృతి సేతు? బిడ్డనికి సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ.

శా. చావన్నన్ భయమంద, రోగమనినన్ శంకింతు, నిప్పట్ల నా
కేవారేనియు నొక్కటే, వృథగ న న్నే లింకఁ బ్రేలింతు? వే
తోఁకో తొఁక్కి యశమ్మొ దుర్యశమొ యేదో యొందు కైకొమ్ము నీ
వే 'వే'ల్పంచు నుతింతు, నెందులకు నీవే పూఁట కామేశ్వరీ.

మ. అతిశీఘ్రమ్మునఁ బోరిచుచో జగమునం 'దంతాదరం బుండ దీ
స్తుతియం'దంచుఁ దలంచి జాల మిటు లిచ్చోఁ జేయుచున్నావొ! యీ
స్తుతియం దాదృతి కేమి; యేను మిగులన్ శుష్కించుచున్నాఁడ, నన్
గృతకృత్యుం బొనరింపు మింకనయినం గేల్మోడ్తుఁ గామేశ్వరీ.

శా. 'నాకై యింత తపమ్ము మున్ను సలిపెన్ నాతండ్రి, నే భక్తిచే
నాకష్టమ్మును దీర్చుకోవలయు' నం చామీఁద నాబిడ్డ దా
నాకైంకర్యమునం గడంగుట కిటుల్ నాకైతఁ బ్రాఁకింతె? మే
లీ కావ్యార్థ మెఱుంగు విద్య రుజ యొట్లీనిచ్చుఁ? గామేశ్వరీ.

మ. కవితాపుత్రులతోడఁ దృప్తిపడి యేఁ గాలమ్ము పుచ్చంగ, నీ
తెవులుంగొంటు కుమారు నిచ్చి నఁను గుందింపంగ నీకర్హమే ?
శివ వాఖ్యాకృతులందు, భర్త శివుఁడై చెల్వారు, మీవంటివా
రవివేకంపుఁ గృతుల్ పొనర్చు టది యన్యాయంబు కామేశ్వరీ.

మ. 'కవితాగోష్ఠి త్యజించె వీఁ, డిపు డెదో కల్పించినంగాని త
ద్వ్యవసాయమ్మునకుం గడంగఁ' డని నీ వాత్మన్ విచారించి యీ
తెవులుం గల్పనజేసి సారె కిటు లెంతేఁ గైత సాగించెదే!
భువి, 'మార్జాలపుఁగేళి యెల్క కుసురుల్ వోఁగొట్టుఁ' గామేశ్వరీ.

మ. కవితాసంతతి దుర్భగప్రతతిసంగం బాచరింపంగ న
య్యావివేకమ్మున రోగమంటికొన నే నద్దాని వెన్వెంటనే
సువివేకమ్మునఁ బాఱఁదోలితి, నిఁకన్ సూనుం గడున్బ్రోంచు నీ
తెవులుం దోలవలెం గవిత్వమున నిన్ దేలించి, కామేశ్వరీ.

మ. కుజునందున్ గుజుఁ డేగె, రాహు విఁక నేగున్ రెండుమాసాల, కీ
కుజరాహుల్ పరికించి చూచిన మహాక్రూరుల్, స్వతస్సౌమ్యుఁడై
విజయంచేయు నిఁకన్ బృహస్పతి, సుఖావిర్భూతి నీ విమ్మహా
ద్విజునంతర్దశనే నొసంగి కొమరున్ దీవింపు కామేశ్వరీ. 128

శ్రీరస్తు - నిరోగశతాయుష్యమస్తు.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ప్రథమపుత్రుఁడు కామేశ్వరుని జన్మపత్రిక.

| | | |
|---|---|---|
| శ | | రా |
| | రాశి | గు |
| కే చ | ల | ర బు శు కు |

| | | |
|---|---|---|
| చ కే | కు | ర |
| శు | అంశ | |
| గు | బు | శ రా |

స్వస్తిశ్రీ ఆనంద సం॥ మార్గశీర్ష బ ౯ శుక్రవారము రాత్రి గం 2-47 నిమిషములకు జననము. లగ్నము తుల, నక్షత్రము హస్త, చరణము తృతీయము, జననకాలచంద్రమహాదశాశేషము ౪ సం॥ ౮, ౧౦ నెలల, ౧౫ రోజులు.

శా. ఈరోగం బెటుతగ్గు బిడ్డనికి? నాఖ్యాగో డెటుల్ వోవు? నా
యారాటం బెటుతీఱు? నీకినుక నీయవ్యాజకారుణ్య మే
పాటందోలవలెన్, భిషగ్వరులు తీర్పంజాలకున్నారు, ని
న్నారాధించితి, నాతనూజునకు సౌఖ్యంబిమ్ము కామేశ్వరీ

మ. 'కలుగుం బుత్రులవల్ల మోక్ష' మని వక్కాణించు శాస్త్రమ్ము ని
శ్చల, మాత్మోద్భవుఁ గూర్చి కాదె? యిటు లాసాయమ్ము నీధ్యానమున్
సలుపం బూనితి నంబరో! యిదియు మోక్షప్రాప్తికే కాక యీ
యిల సౌఖ్యమ్ములకెల్ల నెల్ల యగుఁగాదే, దేవి! కామేశ్వరీ. 130

మ. జననీ! గుత్తిపురమ్మునుండి యనిపెన్ జక్రాలవంశ్యుం డొకం
డు నృసింహుండు భవల్లలాటధృతసిందూరమ్ము నాఁ బొల్చు వం
దు నెదే, నయ్యది చక్రమై వలపి యీదూరోగరక్షన్సు నా
తని గేహాఖ్యను నిల్పె, నీకృప కిదే తార్కాణ కామేశ్వరీ.

మ. నినుఁ బూజించెడిపట్ల, నేత్పణము నేనిం దాన మెవ్వారికే
ని నిడంబోయెడిపట్లఁ, బుత్రి రుజయే 'నే నుంటి' నంచున్ మదిన్
దనుకున్ శల్యమపోలె; మత్సుకృత మేతద్వ్యాధికై సర్వమున్
వినియోగింపుము, నీవు సాయపడి దీనిం దింపు కామేశ్వరీ.

శా. వ్యాపారాంతరమగ్నమానసు భవద్భక్తున్ ననున్ నేర్పుమై
నీపాదమ్ములవంకఁ ద్రిప్పుటకు నీనీచామయవ్యాజ మెం
డాపాదించి తనూజునిం గలఁచెదే, నన్యాయ మట్లైనచో
నేపాపమ్ము నెఱుంగనట్టిఁడు కదా యీకుఱ్ఱ! కామేశ్వరీ.

శా. సంతానంబన, నాఁడు శ్రీదశరథక్ష్మాజాని తాఁ గాంచె, నా
సంతానమ్మును బోలినట్టి దెచటన్ జన్మింపనే లేదు, త
త్సంతానమ్మున నాతఁ డేసుఖము గాంచన్నేర్చె? యోజించినన్
'సంతానంబు సుఖప్రదం' బనుట యున్మత్తోక్తి కామేశ్వరీ.

శా. సూత్రప్రాయముగాఁ బ్రవర్తనము నెచ్చోఁ జేయు నాకీదృశున్
బుత్రిం గల్పనఁజేసి సారె విసువుం బుట్టింతువే? నీకృపా
పాత్రుండం గద, తల్లిరో! సుతు నెటో ప్రారబ్ధకర్మార్తు స
ద్గాత్రుం బూర్ణబలుం బొనర్చి యిటుపైఁ గాపాడు కామేశ్వరీ. 135

శా. కాలం బింకను దీఱకే మనుపు స్వర్గం బేగె నా ప్రాణముం
బోలంజాలినవాఁడు తిర్పతి, సుఖంబుం బొందుచున్నాఁడు ; నా
కాలం బీగతి సేగుచున్నది వృథా కష్టమ్ముపాలై, సుతుం
బాలింపంగదవమ్మ ! రోగము త్యజింపంజేసి కామేశ్వరీ.

మ. 'వడుగుం జేయుద' మన్న వీ లోనఁగ దీశ్వాసామయం, బిట్టి యీ
చెడురోగమ్ము వివాహముఙ్ సలుపు వాసింగూర్చి పెట్టమ్మ ! నీ
యడుగుల్ మొఱిక్కెద దీని కేదో యొక మందంచుం గనంజేసి నా
కొడుకుం బ్రోవఁగదమ్మ ! నీకొడుకుబాగుం గోరి కామేశ్వరీ.

మ. ఋతువుల్ వచ్చుచుఁ బోవుచున్న వొక టేరీతిన్, రజాశాంతి యే
ఋతువ్రం జేసినయట్లు లేదు; సుఖియై యొప్పెని బిడ్డండు వ
ర్ధితుఁడౌనే ? కలనేని దెల్పుము, మనోదీనత్వముం బాపు, మా
శ్రితుఁడఙ్ నీకు, ననుగ్రహింపుము సుతశ్రీ నిల్పి కామేశ్వరీ.

శా. 'అల్లుం డీతఁడు మా' కటంచు సుతుఁ గన్యాదాత లాడంగ, నా
యుల్ల మ్మొండొక భంగి నుంషు, నల వారుత్సాహముం జూప నే
మెల్లన్ మిన్నకయుండు, నీరుజకు నేనే నడ్డు కల్పించి త
త్సల్లాపమ్ముల కుత్తర మ్మిడు నడుల్ సాగింపు కామేశ్వరీ.

మ. ధరలో దుష్కరదుస్తరప్రభృతులౌ తత్తన్మహాకార్యముల్
నెఱవేఱుం దప మాచరించుకతనఙ్ నిక్క మ్మటంచున్ భవ
చ్చరణారాధన సల్పుచుంటిని యథాశక్తిం, గుమారామహో
త్తరణం బెంత దురాపమేని యిఁక సిద్ధం బంబ ! కామేశ్వరీ. 140

మ. ఒకపద్దెమ్మున కొక్కరోఁడయిన నాయుర్దాయ మిఁక జాలు ప
ద్యకదంబంబును నూటనల్వది యిదే యర్పించితిన్ నీకిటఙ్;
సుకముం గూర్చ సగమ్ము కర్చయిననున్ నూన్యాయు వౌ డెబ్బదిం
టికిఁ బై, నంతియ చాలు సౌఖ్యగరిమం దేలింపు కామేశ్వరీ.

శా. నిన్నుం దట్టుటయున్ ఘటించెఁ గొమరు న్నేఁ డుద్యమత్వీడు సేఁ
గన్నారం గననేర కార్తి యయుతుపంగాఁజాల కోయమ్మరో !
“యన్నిష్ఠంధ్యం పుఁబనిం బొనర్చ నను నీవే చంపి, రక్షింపు మా
పన్నక్షేమ మత్సు నార్తిఁబాపి” యనుచుం బ్రార్థింతుఁ గామేశ్వరీ.

శా. అయ్యయ్యో! యిది యేమి పాపము? కుమారాంబా! సుతుల్లేరె నీ కే
కియ్యార్తిన్ శిశు వెట్లు సైఁపఁగలఁ? డిట్లేడ్పింతువే భక్తులన్?
గుయ్యాలింపవె? యింత ఘోరకలియే? కొంతేనిఁ జింతింపవే?
న్యాయ్యంబే కద! నా కిటుల్ సలుపుటల్, నాతల్లి! కామేశ్వరీ.

మ. కడుపెల్లం జెలువొను, గుజ్జ వడు నీకష్టమ్ము వీక్షింపఁగాఁ;
గొడుకే కా దొకశత్రువే యను, మి దే క్రూరుండు సైరించు? నీ
యడుగుల్ గొల్చెడి నాకు నీ విటులు ప్రాయశ్చిత్తముం జేసెదే!
తడఁబాటో, దయలేదొ, నిన్ గొలుచుటే తప్పౌనొ? కామేశ్వరీ.

శా. 'సంతాన మ్మది వల్వ దేరికి, నిఁకన్ సంతానమే వద్దు, నే
సంతానమ్మును గాంచుమీఁద మిగులన్ సంతాపముం గంటి, నా
సంతాపమ్మును దీర్ప నిప్పటికి మా శర్వాణికిం గా' దటం
చెంతో దీనముగా వచించు టది నీ కిష్టంబె? కామేశ్వరీ. 145

మ. "గురు సంతర్దశనుండియైన రుజకుం గోపోపశాంతిన్ శివం
కరమారీతి ననుగ్రహింపు" మని వెన్కం గోరియున్నాఁడ, ని
త్తటి యుద్రేకము చూడ నంతదనుకం దాళండు బిడ్డండు, శాం
కరి! యీలోపునఁ గొంత శాంతి నెటులో కల్పింపు కామేశ్వరీ.

మ. త్రుటి యొక్కొక్క యుగమ్ముగా సకట! పుత్రుం డుండె నోయమ్మ! సం
కట మంతంతకు హెచ్చి విచ్చలవిడిన్ గారింపఁగాఁ జొచ్చె, నిం
తట నీ వడ్డముసొచ్చి రాహుగుణముం దగ్గించి యొక్కింత య
క్కటికమ్ముం బ్రకటించినం గలుగు సౌఖ్యం బంబ! కామేశ్వరీ.

శా. నాకున్ సంస్కృతియం దనాదరము గస్పట్టంగఁ బుట్టించితే
వీఁకన్ వీనిఁ గుమారుఁగాఁ, బ్రీతి నిశన్ వీఁ డందు శ్వాసామయో
ద్రేకమ్ముం గని యోర్చు టెట్లు? కరుణోత్సేకమ్ము నూకొల్పి నా
తోకమ్మున్ సుఖపెట్టి నాకిడుము సంతోషంబు కామేశ్వరీ.

మ. తమ ఆఖ్యాకుఁడు రాహుదుర్గ్రహము బల్ దర్పమ్మునం బొంగి దుః
ఖము రెట్టించుఁ గుమారుపట్ల నిశలన్, గళ్యాణిరో! రాత్రిభా
గములం దెక్కుడు నీసహాయ మది నేఁ గాంక్షింతు, బిడ్డండు టి
క్కమొగంబై ధృతి దూలకుండనయినం గాపాడు కామేశ్వరీ.

శా. గంటల్ రాతిరి యెన్ని కొట్టఁబడెనో, కళ్యాణిరో! వాని న
న్నింటి న్నే వినుచుంటిఁ బుత్రుకతనన్, నీ సత్కృపాస్ఫూర్తి యే
వెంట౯ దాఁ బ్రసరింపదయ్యె, నెటుల౯ వేగింతు నీకుఱ్ఱతో
నింట౯ గాఁపుర; మార్తిఁ బోకడపగాదే? తల్లి! కామేశ్వరీ. 150

శా. ఏదో మంచిఫలమ్ము నీకతన నా కీపద్యముల్ తెచ్చుఁ, ద
త్ప్రాదుర్భూతి సుతామయప్రశమరూపంబే యగు౯, దానిచే
నాదౌర్భాగ్యము శాంతిఁజెందు, సుఖమున్ నాకబ్బు; నీకన్న 'నే
తాదృగ్దైవత మెందు లే' దను మహత్త్వం బబ్బుఁ గామేశ్వరీ.

మ. 'ఇలువే' ల్పంచును గొన్నిగోత్రములవారే త్వత్పదాంభోజపూ
జలు సేయ౯ గమకింత్రు మ; న్నిపుడు నా సంతానముం బ్రోచుచో
నిలయెల్ల౯ భవదర్చకప్రకరమై యేపారు, సంతానవం
తులు నీచే నగుచుందు రెల్లరుఁ గృతార్థుల్ తల్లి! కామేశ్వరీ.

మ. మహితంబైన భవన్మహామహిమము౯ మాయింట నస్మత్పితా
మహి రామాంబిక చేత వింటి మును పంబా! నీదు నావేశ మ
మ్మహిళామాళి వహించి చిక్కడలు నమ్మార్గమ్ములన్ జెప్పి యి
మ్మహి నీకుం దులలేమిఁ దెల్పెడిదిసుమ్మా! యమ్మ! కామేశ్వరీ.

శా. 'నీపై నూరక యిన్నిపద్దెములు నే నిర్మింతునే? శ్రేయముల్
ప్రాపించున్ ధ్రువ' మంచు నామదికి ధైర్యం బబ్బెడిన్; రోగమో,
యేపింకన్ విడలేద, కారణ మదేమీ? రాహుదుశ్శీలమున్
బాపన్ రామియొ, శ్రద్ధలేమియొ, కృపాభావంబొ! కామేశ్వరీ.

మ. హిమవత్పుత్రి! గజాస్యషణ్ముఖసవిత్రీ! సర్వగీర్వాణరా
ట్ప్రముఖారత్నసమర్చ్యమానచరణా! భద్రాత్మికా! భద్రదా!
శ్రమతాపాదిసమస్తరోగశమనీ! సంతానసంరక్షణీ!
సుమనఃకల్పలతా! సుతున్ మనుపుమీ! జోహారు కామేశ్వరీ. 155

మ. శివదాత్రీ! శివదివ్యదేహచిరవాసిబ్రహ్మచర్యావ్రత
ప్రవిభేత్త్రీ! కమనీయగాత్రి! సకలాపద్దుర్గతాచ్ఛేత్త్రి! స
త్కవయిత్రీష్టవిధాత్రి! భక్తజనసంతానార్తిసంహర్త్రి! మ
త్కవనమ్ముం గయికొమ్ము పుత్రునకు సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ.

మ. సకలేశాని ! భవాని ! శాంకరి ! జగత్సంరక్షణాయత్తసాం
ద్రకృపాభాస్వర, సత్కవీశ్వరమనస్తాపాగ్నికాదంబినీ !
వికచాంభోరుహనేత్ర ! నీదయకు నువ్విళ్ళూరుచున్నాఁడఁ, బు
త్రకు రక్షింపఁగదమ్మ ! గండ మెటులో దాటించి, కామేశ్వరీ.

శా. నీకారుణ్యముకల్మి శ్వాసమయమా నీచారి నిర్జించి తాఁ
జైకిన్ గుజ్జుఁడు వచ్చి వర్ధిలినచోఁ 'ప్రాణావశిష్టుండు వీఁ
డీకల్మిం గనె, సంబ్రమా' యనుచు నిన్నే యమ్మలక్కల్ నుతి
పాత్రికట్యమ్మునఁ జెప్పికొందురుసుమీ ! పల్మాఱుఁ గామేశ్వరీ.

శా. నీకారుణ్యము కల్గుటే కడమ కానీ, కల్గునల్లంతలో
దూఁకుం డొంకలఁబట్టి రోగములు, డిందుం దాపముల్ పాపముల్,
చేకూరున్ బల మాయువున్ సుఖము, సుశ్రీ వర్ధిలున్, లోపమే
లేకుండు న్నిను నే నెఱుంగుదును దల్లీ ! ప్రోవు కామేశ్వరీ.

శా. 'చాముండా' యను నామధేయము ద్విషత్సంహారముం జేసి యీ
భూమి న్నీకుఁ బ్రసిద్ధమై తెలుఁగుదున్ ; బుత్రార్తిసంహారమం
దేమాత్రమ్మును శ్రద్ధ కైకొనక నన్నీరీతి వేధించు నీ
'చా, ముండా!' బిరుదం బపార్థకముగా సాధింతుఁ గామేశ్వరీ. 180

శా. ఏమాహాత్ముఁడొ నన్నువంటియొకఁ డేదేఁ గోర్కెకై వేడ నీ
వీ మాంద్యమ్మును వానికోర్కెయెడ నిట్లే చూపఁగా, భక్తుఁడు
ద్దామక్రోధముఁ బట్టఁజాలక నినున్ దాఁ దిట్టెనేమో కదా !
'చా, ముండా!' యని; యింక నేనియుఁ గృపన్ సాగింపు కామేశ్వరీ.

మ. మిగులన్ భక్తులఁ గష్టపెట్టు టిడియున్ మెచ్చానె ? యట్లైనచోఁ
'దగితే లింగఁడు రాయి' గాదె ? మది కుద్రేకమ్ము గల్గించుటల్
తగునే ? తల్లిరో ! నిన్నువంటికరుణార్ద్రాంబా మహామూర్తికిన్
బగవాఁడే పసిపాప ? నాకొమరునిం బాలింపు కామేశ్వరీ.

శా. రెండేఁడుల్ చనవచ్చె, వ్యాధి యొకచేరీతిన్ విజృంభించె, నొ
క్కండున్ మం దగుపట్టదయ్యె, భిషజుల్ కష్టించి లజ్జించి రు
ద్దండార్తిప్రపత్తిప్రవీణము భవద్దాస్యంబు తానంత వే
ఱొండు న్నాకిడె నీదుసేవ వృథగా దోయమ్మ ! కామేశ్వరీ.

మ. హిమవత్పుత్రికవైన నిన్ గుఱిచి నే నిన్నాళ్లు [illegible]ంప్ర మ
ర్చ్ఛమమునుం బాపఁదలంచి నీ జనకభూపాగ్రింతమ్ము [illegible]
క్కు మహామూలిక పంపి తంబరో ! యిటే కాకున్నఁ [illegible]
శమునం దున్న యమూల్యమూలిక యెటుల్ సాధ్యంబు కామేశ్వరీ.



శా. పంజా బెక్కడ ! వేరదెక్కడ ! మహాపద్వారకంబౌచుఁ దా
సంజీవిన్యవధానవల్లరి యనన్ సంప్రాప్త మాటేడ ! యా
ర్తిం జూఱఁగొను టేడ ! యంబరో ! భవచ్ఛ్రీపాదముల్ పద్యపుం
బుంజంబుల్ రచియించి కొల్చుఫల మీ పున్నెమ్ము కామేశ్వరీ. 185

మ. తన సోదర్యునిశ్వాసకాసల నెటుం దా మాన్పికోలేక యం
బ ! నినుంగొల్చెడి నన్నుఁబోలె నల 'బర్మాడాక్ట' రుండంగ, నా
తని కీవేరు లభించె, నా కిది యయత్నప్రాప్తమయ్యెన్ జిరం
తనపుణ్యంబున నీకృపాగరిమచేతం దల్లి ! కామేశ్వరీ.

శా. 'బర్మాడాక్టరు' సోదరుం డొకరుఁ డల్పప్రాయపుం గుఱ్ఱఁ డో
శర్మాధాయిని ! నాదు పడ్డకుని శిష్యవ్రాతమం దుండె, నీ
మర్మం బాతఁడు వానిచే నెఱిఁగి తన్మాత్రార్తికై కైకొనెన్;
గర్మాంతమ్మయి నాకు భాగ మచటన్ గల్పించెఁ గామేశ్వరీ.

మ. మణిమంత్రౌషధిశక్తు లెంతయు నసామాన్యంబు, లీశక్తులే
యణుమాత్రంబును గోచరింపవుసుమీ, యంబా ! భవత్సేవకా
గ్రణులం దక్కఁ దదన్యులందు, నిజ మిక్కాలమ్మునం గూడ ని
మ్మణిమంత్రౌషధిశక్తి నీకొలుపు సంపాదించుఁ గామేశ్వరీ.

శా. ఏవే రీశ్వరవేరు శ్వాసరుగహిస్వేచ్ఛానిరోధమ్మునం
దావే రున్నది నీదు పుట్టినిలుచాయన్, దాని నేయోగియో
యీవుంబోలె నెఱుంగు, నింతనె జగం బేరీతి జీవించు ? నో
దేవీ ! యీకృతి కట్టిశక్తి నిడి పృథ్విన్ బ్రోవు కామేశ్వరీ.

శా. దేనిన్ గంఠమునన్ ధరించు నెడ నుద్రేకింపకే శ్వాసకా
సానూనార్తి యడంగు నయ్యది యమూల్యంబైన వేరద్దియే
నీనామాంకితమైన కావ్య మని దీనిన్ బండితుల్ మెచ్చుకోఁ
గా నీ వీకృతికిన్ మహత్త్వ మొసఁగంగాఁ గోరి[illegible] కామేశ్వరీ.

మ. మును నన్నుం [illegible]నుచుందు నాకవనముం మాచూపఁ గాంక్షించి, యో
జననీ ! యిప్పు[illegible] 'శ్వాసకాసల నడంచ న్నేర్చుఁబో!' యంచు ద
ర్శనముం జేయఁ దొడంగి, రేమిగతి ? యీ సత్కావ్యమం దట్టి శ
క్తిని వే ర్వెల్లఁ దుల్యందుఁబోలె నిడి ఖ్యాతిం డెమ్ము కామేశ్వరీ.

మ. పడిసెంబో, తలనొప్పియో, జ్వరమొ సంప్రాప్తించుచో వైద్యులం
దడవన్ లాభము గల్గినం గలుగు, దుర్దాంతవ్యధాభారముల్
గుడువం దాపగుచో నరుం డెఱిఁగి తాఁ 'గుయ్యో మొఱో' యంచు నీ
యడుగుల్ వట్టుటయే రుజాపనయనోపాయమ్ము కామేశ్వరీ.

శా. ఏ నేపాటి ? సమస్తకారణుఁడు శ్రీకృష్ణుండు మున్నాత్మసం
తానార్తిం దొలఁగించుపొంటె నిను బల్ దైన్యమ్ముమై వేఁడి, నీ
చే నాకోర్కి లభింపఁగా, సుఖము వాసింగాంచి సంసారియై
తా నెందున్నెగడెన్, భవచ్చరణముల్ ధ్యానింతుఁ గామేశ్వరీ.

మ. ఇహమందున్ని నుఁగొల్చువారలకు సర్వైశ్వర్యముఖ్యమ్ములౌ
బహుసంపత్తులు గల్గు, వ్యాధు లుడుగున్, ప్రఖ్యాతి వర్ధిల్లు, దు
స్సహ మేవారికిఁ గల్గ; దింకఁ బరమో, స్వర్లోకమున్ మించుఁబో
యహహా ! నీచరణార్చనం బిడు సుఖం బవ్వారి, కామేశ్వరీ

శా. ఇక్కట్టేదియొ నాకుఁ జేకుఱియు, నాయిక్కట్టు నాపట్ల స
మ్యక్కీర్తిప్రదకార్యహేతువుగ బాల్యమ్మాదిగా మాఱు నో
యక్కా ! యట్టులె యాత్మజాతురుజ నీయవ్యాజపుం బేర్మిచేఁ
జక్కన్ ప్రుక్కి సుకావ్యరూపమున మించంబోలుఁ గామేశ్వరీ. 175

మ. ఒకయిక్కట్టున విద్య, వేఱొకట విద్యోద్రేక, మింకొక్కటన్
సుకవిత్వమ్ము, మఱొక్కటన్ సుకవితాస్తోకత్వసామగ్రి, వే
ఱొకటన్ యోగము, భోగమో మఱియు నింకొక్కంట, నీపేర్మిఁజే
సి కడుం గస్తి సుఖాకృతిన్ బరిణమించెం దల్లి ! కామేశ్వరీ.

శా. దారిద్ర్యమ్మున నేమి, జవ్వనపు దుర్దర్పమ్ము చే నేమి, బల్
ధీరత్వమ్మున నేమి, సర్వమున నేదేఁ జిక్కు వాటిల్లు నా
యారీతుల్ పాడనూపియుం దుదకు నీయవ్యాజపుం బేర్మిచేఁ
బేరై మేటిప్రతిష్ఠలై యవి ననున్ బ్రేమింపఁ జేఁ గామేశ్వరీ.

మ. అటులే నేఁడు కుమారుఁడూరుజయు నీయవ్యాజపుణ్యప్రేమచే
నిటు లేతత్కృతిరూపమై సుఖముఖానేకక్రియోద్దారమై
స్ఫుటకీర్తిన్ ఘటియించు సూచనలు రేపున్మాపుఁ దోఁచున్; భవ
ద్ఘటనం బెవ్వఁడెఱుంగు, నెట్లొనరుపం గాలేవు? కామేశ్వరీ.

మ. అల సత్యవ్రతుఁ, డాసుదర్శనుఁడు నేమానట్లు మున్దోఁచి, ర
వ్వల నేమైరి? భవత్కృపావశత; నేవ్యాధుల్ మఱేచిక్కులున్
గలఁచన్నేరవు నీకృపావశుల, నిక్కమ్మింత, మత్పుత్రి నీ
యిల సత్యవ్రతుఁగా, సుదర్శనునిగా నీక్షింపు కామేశ్వరీ.

శా. ఆయుశ్శ్రీబలదాయకంబులు త్వదంఘ్ర్యంభోజరేణుచ్ఛటల్
నాయందున్ బ్రసరించినందులకు నానాఁటన్ సుతుం డామయా
పాయమ్మున్ గడఁద్రోసి వృద్ధికిరవై భాసిల్లుచున్నాఁడు, నీ
సాయం బూరకపోదు భద్రముల నిచ్చల్ గూర్చుఁ గామేశ్వరీ. 180

శా. ‘గ్రామారిష్ట మడంగఁజేయు’ మని త్వత్కాంతుఁ, నినున్ ‘బుత్రకున్
గామేశాఖ్య నరుగ్ణుఁజేయు’ మనియున్ గావ్యోక్తిమాలమ్మునన్
మీమీమంచి గణించి వేఁడితిని, నన్ మీరర్థి మన్నించినా;
ర్క్రమే లెల్లెడ నేను జెప్పికొనెదన్ మిమ్మట్టిఁ గామేశ్వరీ.

శా. నీ వాపత్తులపట్ల సాయపడినట్లే సంపదర్థమ్ములన్
రావుశ్రీకులరత్నభూషణము శ్రీరామాంబ సాహాయ్యమున్
గావింపన్ వెనుదీయకోమెడి ననున్, గళ్యాణి! యమ్మాతృకన్
భావింతున్ “భవదంశ”మంచు మది సంభావింతుఁ గామేశ్వరీ.

మ. చదువుల్ నేర్చితి దిగ్విజేతనయి యాచంద్రార్కభాస్వద్యశః
పదమై మించితి, భాగ్యపుంగరిమతో భాసిల్లితిన్, గండముల్
తుదముట్టించితిఁ, గంటి సంతతిని, సంతోషించుచుంటిన్; భవ
త్పదదాస్యం బొడఁగూర్పలేని దొకభద్రం బున్నె! కామేశ్వరీ.

మ. శశిశేషం బయిదేండ్లు భూసుతదశాసంవత్సరా లేడునున్
గృశతాకారక మాచు వ్యాధి మిగులన్ గ్లేశంబు గల్పించె, నా
ర్తిశమారంభము రాహు వాదినె ప్రసాదించెనా; సమస్తంబు నీ
వశ, మున్నంటికిఁ దల్లి! నీయదియె మాభారంబు కామేశ్వరీ!

శా. ఏమాత్రంబు వివేకమున్న మనుజుండేనిన్ గృహాపత్యభూ
రామారామమయంబు సంసృతియెడన్ రాగిల్లుటే తప్పు, త
త్కామముల్ కొండొక నీపదాంబుజములన్ ధ్యానించుచో సంతత
క్షేమం బబ్బెడిఁ, దక్కువారి కసదౌ సేమంబు; కామేశ్వరీ. 185

మ. కొడుకుల్ గూఁతులు నేఁగు రిప్పటికి నాకున్ నీకృపంగల్గి; రే
యెడ నివ్వాంఛ్ర ననుగ్రహించుటయు, నాయీనన్ను దైన్యంబు పా
ల్పడకుండం దగఁజూచుచుండుటయు నిన్ బ్రార్థింతు నోయమ్మ! నీ
యడుగుల్ గొల్చెడి దాసదాసులకు దాస్యార్హుండఁ గామేశ్వరీ.

మ. అతిచిత్రంబు భవచ్చరిత్రము, తదీయంబైన మాహాత్మ్యప
ద్ధతి వర్ణింపఁగ నాకు శక్యమగునే? తల్లీ! సుతున్ మున్ను దు
స్థ్సితిలో ముంచినవ్యాధి యిప్డు సురిఁగెన్, దేహమ్ము నానాఁట వ
ర్ధితమయ్యెన్, గళ కాంతు లుప్పతిలె, సుశ్రీ మించెఁ; గామేశ్వరీ.

శా. నాయంతైనను గాకయున్న నెటులో నాపుత్రుపై నీకృపా
వ్యాయామం బుదయించు నక్కతన విద్యాస్ఫూర్తి యవ్వానికిన్
స్వాయత్తం బిఁకఁగాకతీఱదు, రుజాహంకార మింకీపయిన్
ఛాయన్‌గూడ స్పృశింపకుండునటులన్ శాసింపు కామేశ్వరీ.

శా. అంబా! నీదయ కంతులేదుగద! ప్రత్యక్షంబుగా రాత్రి స్వ
ప్నంబందుఙ్ బొడకట్టి తేదియొ శుభావాప్తిఙ్ భవన్మూర్తి దృ
ష్టంబై తెల్పుట నిక్క, మయ్యది సుతశ్వాసామయోచ్ఛిత్తి క
న్యంబైయుండదు, నాదునిశ్చయము తథ్యంబౌతఁ గామేశ్వరీ.

మ. వడుగుం జేయఁగ వీలులే దనిన మావానిఙ్ భవత్సత్కృపా
జడధిస్నానము నేఁడు పెండ్లికొడుకుఙ్ జల్పించి యుత్సాహ మె
క్కుడుగా నాకొడఁగూర్చె; నీదు నడుగుల్ గొల్వన్ మొదల్వెట్టి యొ
వ్వఁడుగానీ చెడిపోఁడు, భద్రములు సంపాదించుఁ గామేశ్వరీ. 190

మ. పరమాదృష్టము పెట్టిపుట్టినటు లే భావించి గర్వింతు, దు
స్తర. మీ హస్త్రాణశకమ్ము్నం దితరభాషఙ్ బొట్టకై నేర్వ శే
సురభాషఙ్ బఠియించి యక్కతన సంస్తుత్యుండనై మించితిఙ్,
సిరియున్ సంపదగూడ నీకరుణచేఁ జేకొంటిఁ. గామేశ్వరీ

మ. కలిగెన్ "లే" దనుకొన్న సంతతియు, భాగ్యంబు బెచ్చె, నానందసం
కుల మయ్యెన్ జని, షష్టిపూర్తియును నాకున్ దాపుగా వచ్చె నో
లలితాంబా! యిఁక నొక్కకోర్కి, యది వాలాయమ్ము మద్విద్య ల
ర్మిలి మత్పుత్రులయం దమర్చుటయె సుమ్మీ తల్లి! కామేశ్వరీ.

మ. కల రీకాలమునం దనేకులు ధనాకాంక్షాప్రధానమ్ములౌ
పలువిద్దెల్ పఠియించి యక్కతన సంపన్నత్వమున్ గాంచి పు
త్రులఁ దద్విద్యలయందుఁ జొన్పెడి యిహార్థుల్; నాకుఁ బ్రాచీనవి
ద్యలయం దెక్కుడు నాదరం బగుట నిట్లర్థింతుఁ గామేశ్వరీ.

శా. "విద్దెల్ ద్రవ్యముకోస" మన్న నుడికిన్ విజ్ఞుల్ ప్రమోదింప, రే
ప్రొద్దో దేననొ పొట్ట నింపికొని రేపున్ మాపు సద్వ్యాపృతిన్
ఒద్దన్ గాలముపుచ్చుటే ద్విజులకున్ ధర్మమ్ముగాఁ బూర్వపుం
బెద్దల్ సెప్పిరి; నేను వారినుడులే ప్రేమింతుఁ గామేశ్వరీ.

మ. ఒకసిద్ధాంతి లిఖించె 'షష్టి' యని, వేఱొక్కం డశీత్యబ్దముల్
ప్రకటించెన్ మఱి నాకు నాయు వెది సంభావ్యంబు? పత్యుద్వయా
నకుఁగూడన్ గ్రహవృత్తి సాధకముగా నాబుద్ధికిన్ దోఁచు, దే
నికిఁ బ్రామాణ్యమె నాకెఱుంగఁదరమే? నిక్కంబు కామేశ్వరీ. 195

మ. అరయన్ షష్టియె యైనచోఁ బ్రకృతదేహస్వాస్థ్యమే చాలుఁ, ద్వ
త్కరుణోద్రేక మశీతిదాఁకఁ జనుచో దార్ఢ్యమ్ము సంపాద్యమే
నెఱవో దానికి నీవ చూడవలెఁ; ద్వద్వీక్షామృతం బబ్బుచో
నోరుమున్ దేహబల, మ్మనామయత నాయుస్సందుఁ గామేశ్వరీ.

శా. "ఆయుః స్సెక్కుడుగా నొసంగు" మని నిన్ యాచింప నోతల్లి! యే
యాయాసమ్మును లేని జీవితము నే యాచింతుఁ గేల్మోడ్చి; యో
శ్రేయోదాయిని! నాదు తప్పిదము లార్తింబోలెఁ బోకార్చు, మా
మ్నాయధ్యేయము త్వత్పదద్వయి మదిం బాటింతుఁ గామేశ్వరీ.

శా. అంతో యింతయొ విద్య నిచ్చితివి, లోకారాధ్యుఁ గావించి, తా
శాంతశ్రాంత యశంబొసంగితి, వపత్యైశ్వర్యముల్ గూర్చి, తే
మంతుల్ సేసిన నన్నుఁ బుత్రునిబలెన్ మన్నించి రక్షించి తే
చింతల్ లేని త్వదంఘ్రిసేవన మిఁకం జేకూర్చు కామేశ్వరీ.

[illegible] ...టొప్పంగద, శోకం బిచ్చియున్నప్పుడో
[illegible] యది నీ వెఱింగినదియే కాఁబట్టి సుంతేని వై
కల్యం బేర్పడకుండ నాదుప్రకృతిన్ గాపాడు మోయమ్మ! సా
ఫల్యం బప్పుడు నాదుసంస్కృతికి సంప్రాప్తించుఁ గామేశ్వరీ.

శా. ఏమో నీదయ యెట్లువచ్చిన సరే, యీనన్ను నీభక్తుఁగా
సామాన్యప్రజలున్ మహామహులు నిచ్చల్ మెచ్చికొంచుంద్రు; నా
నేమంబెల్ల భవద్వశంబ, యెటు వాసింగూర్చి రక్షించెదో!
ప్రేమింపందగువాఁడ నేనిఁ దయతోఁ బ్రేమింపు కామేశ్వరీ. ౨౮

శా. ఆశ్వాసాంతముదాఁక శ్రావ్యమగు కావ్యంబట్టులే జీవితం
బాశ్వాసాంతముదాఁక రమ్యమగునో నాశాస్యమై సవ్యమై
శశ్వన్మంగళసంగతంబునయి విశ్వశ్రేయమై పొల్చు, నో
విశ్వేశీ! యటులౌట సారెకిటు నావిజ్ఞప్తి కామేశ్వరీ.

మ. ఇహసౌఖ్యం బనుభూతమాయె, సగ మాయెన్ భుక్త మోయమ్మరో!
గృహవర్గాయువునందు, నాకు నిఁక భోగ్యం బెంతకాలమ్మను
గ్రహపూర్వంబుగ నీ వొసంగెదవొ, తత్కాలంబు జ్ఞానోదయ
స్పృహణీయం బగునట్లొనర్చుటయె నాసేమంబు కామేశ్వరీ.

మ. ఇల దీనిన్ బఠియించువారికి సుఖమ్మెక్కాలమున్ గల్గు, వా
రల సంతాన మనామయమ్మగుచు దీర్ఘంబైన యాయుస్సుతోఁ
జెలఁగున్, వాండ్రకు విద్యయు న్విభవమున్ జెన్నారు, నాకల్పమున్
గలిసంహారకమంత్రమై యలరు నీకబ్బంబు కామేశ్వరీ!

## గద్య

ఇది శ్రీకింకరవీంద్ర ఘటాపంచానన ...............
తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబగు ఆరోగ్యకామేశ్వరి
సంపూర్ణము